


అను

# బలేరాముడు

గ్రంథకర్త:

గోశేటి వెంకటచలపతిరావుగారు.



పబ్లిషర్సు:

సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ, (కృష్ణాజిల్లా).

# నేనే

అను

# బతేరాముడు

(అపరాధ పరిశోధక నవల)

గ్రంథకర్త:

సౌదామిని, దొంగరాముడు,

ప్రణయమహిమ, వసుంధర, రచించిన

## గోటేటి వెంకటాచలపతిరావుగారు





ఐదవకూర్పు 2000 ప్రతులు.



ప్రకాశకుడు:

కురుకూరి సుబ్బారావు,

ప్రొప్రయిటరు:—సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

కాకినాడ

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1938.

 [వెల 0—1—

# కృతిసమర్పణము.

---

ఏ మహామహుఁడు జగన్నాటకసూత్రధారియై ప్రాపంచకసత్త్ర మంతయు వినోదలీల పరికింపుచుండునో, ఏదివ్యపురుషుఁడు, రూపహీనుఁ డయ్యు, ప్రాకృతుల సుస్థిరభావమునకై పవిత్రక్షేత్రముల దివ్యమంగళ విగ్రహముల వెలయుచుండునో, ఏపరంజ్యోతి జంగమస్థావరపర్యంత ముంగల చరా చర సంగతి యందెల్ల నిండియుండునో, ఏపురుషుఁడు పరమ యోగిహృదయాంతర్వర్తియై, హితులును, అహితులును లేక సర్వద యాళుండై వర్తించుచుండునో, ఏసాధుజనకల్పవృక్షుండు, ఫలపుష్ప పత్రతోయములతో సంతృప్తినొంది తనపాదపద్మముల ననవరతము ధ్యానించు భక్తుల అభీష్టముల తన్నొడ్డియైన నెరవేర్చునో, నీవే తక్క అనన్యశరణ్యం బెరుగ కావుమని దీపించు దీనుల మొరాలకించి భద్రప్రాప్తి సంధిల్లఁజేయునో, అట్టి పరమాత్మకు సకలదేవతాసార్వభౌమునకు, ఆర్తత్రాణపరాయణునకు, భక్తక్లేశసర్వేశ్వరునకు, సచ్చిదానంద స్వరూపునకు, నాభక్తికొలఁదిని యీ నవలను అంకిత మొనర్చుచున్నాఁడను.

గ్రంథకర్త

గోటేటి వెంకటచలపతిరావు,

నరసాపురము.

శ్రీ గురుభ్యోన్నమః.

# నే నే

## మొదటి ప్రకరణము.

---

ఉదయము యెనిమిదిగంటలు కావచ్చు. బెజవాడ పోలీసుస్టేషను వద్ద మోటారుకా రొకటి వేచియుండెను. కార్యస్థానమున (స్టేషను) లో పోలీసుసర్కిల్ యినస్పెక్టరుగారు, చేత నొకకాగితమును బట్టుకొని యెద్దియో నిదానించుచుండిరి. ఆసమయమున, మోటారుసైకిలు మీద యువకు డొకడు స్టేషను జేరుచుండెను. సర్కిల్ యినస్పెక్టరుగారు విచ్చేయు పురుషునిగాంచి మందహాసముతో 'శ్యామలరావుగారూ! దయచేయుడు మిముబోటి యపరాధపరిశోధకులు తీరికగా నుండరాదు. మీకొరకే నిరీక్షించుచుంటిని. దీనిని పరిశీలింపుడు.' అని చేతనున్న కాగితమును శ్యామలరావున కొసంగెను. అతడు దాని నిట్లు జదువుచుండెను.

"బెజవాడ పోలీసుసర్కిలుయినస్పెక్టరుగారి దివ్యసముఖమునకు-

అయ్యా! బెజవాడ.

నే నీయూర కాసులవర్తకము చేయుచుండు మారువాడీని. మా కాపురము బొంబాయి. నాపేరు రామనాన్. నే నీయూరిని సుమారు పదిసంవత్సరములనుండి నివసించుచున్నాను. ఈయూరి కాపురస్థులైన గవ్వల గౌరీనాథంగారు, తమరు పాతబజారునగల మేడను నాకు ఇరువది వేల రూప్యములకు విక్రయించినారు; సదరు సొమ్మును రిజిష్ట్రారువారి యెదుటనిచ్చి క్రియపత్రమును రిజిష్టరు చేయించుకొనుటకై, మే మిరువురము సాక్షులతోసహా, నిన్న మధ్యాహ్నము రిజిష్ట్రారువారి ఆఫీసునకు పోయి యుంటిమి. నాదుకాణముపై నాతమ్ముని గోపీనాథుని, నా మేనల్లుని రఘునాథుని కూర్చుండబెట్టి యుంటిని. గోపీనాథునకు పాతికసంవత్సరములును, రఘునాథునకు యిరువది సంవత్సరములును వయస్సు.

నిన్న సుమారు పండ్రెండుగంటలకు ఒక మోటారు నాదుకాణ మువద్దకు వచ్చెను. అద్దాని వెనుకభాగమున గూర్చొనియున్నవారు పరులకు గానరాకుండ నల్లకీలుగుడ్డ వైచియుండెను. ముందుభాగమున డ్రైవరును, ఒక యుద్యోగియుఁడును గూర్చుండియుండిరి. ప్రక్క నొక బిళ్ళబంట్రోతు నిలువబడియుండెను. వారు యేబది కాసులను కొని, తమ యధికారిణివద్ద విక్రయింపబడు కొన్ని సువర్ణాభరణములు గలవనియు, వాటిని యేదో ధరజేసియిచ్చి, క్రొత్త కాసులను దీసుకొనుననియు నచ్చ జెప్పి నాతమ్ముని మోటారుమీద దీసికొని బోయిరి. అత డింతవరకును గృహాము చేరలేదు. వానియొద్ద ద్రవ్యముగాని, వస్తువులుగాని యేమి యు లేవు. మేము పట్టణమంతయు కలయవెదకినను గానిపించలేదు. కావున దొరతనమువారు తగుశ్రద్ధవహించి నాతమ్ముని విషయమై దర్యాప్తు చేయించగోరుచున్నాను. ఇందుతో నాతని ఛాయాపటమును బంపుకొనడమైనది. దివ్యచిత్తమునకు తేవలెను.

రామనాథ్ వ్రాలు."

శ్యామలరావు దానిని తిరిగి తిరిగి చదువుచుండెను. అత డెద్దియో యోచింపుచుండెను. ఆసమయమున పౌరులు గుంపులు గుంపులుగా జేరి, కార్యస్థానమువైపు విచ్చేయుచుండిరి. వారితో రక్షకభటు డొకడు కూడ కలడు. వారెల్ల సర్కిల్ యినస్పెక్టరుగారిని జూచి 'అయ్యా! గౌరీపతిరావుగారి యింటితలుపులన్నియు, లోపల ఘుడియలు వేసియున్నవి. ఆయనకొరకు వచ్చువారు, బయటనుండి పెద్దపెట్టున కేకలు వేయుచున్నను సమాధానములేదు. లోపల అలుకుడేమియు వినిపించుటలేదు. ప్రాచికను లేమియు జరుగలేదు. ఇరుగుపొరుగువారలు తలుపు గ్రుద్దినను పలుకుటలేదు. అంతయు చోద్యముగానున్నది' అని బలికిరి. శ్యామలరావు మాట్లాడక కాగితమునే నిదానించుచుండెను.

సర్కిలు యినస్పెక్టరు, పత్తేదారుడు, రిపోర్టు జేసిన ఇరుగుపొరుగువారు, గ్రామఉద్యోగస్థులు మాత్రము లోనికి బోవుచుండిరి. రక్షకభటుడు ద్వారమువద్ద నిలువబడి లోని కెవ్వరిని పోనిచ్చుటలేదు.

శ్యామలరావు గదుల తలుపులన్నియు గెంటి జూచుచుండెను. తలుపులన్నియు దీసియే యుండెను. పడకగదియందు రక్తపుమరకలుగాని, దుర్గంధముగాని లేదు—కాని—మంచములపై వేసియున్న పరుపులును, దుప్పట్లును, నలిగియుండెను. గోడలన్నియు నిన్న మొన్న వెల్ల వేసిన ట్లుండెను. ఇంటియందు మంచములు, పరుపులు, బట్టలు, బిందెలు, చెంబులు, కట్టెపుల్లలు, పిడకలుతక్క తదితర చరాస్తి యేమియు లేదు.

ఎల్లరు స్తంభీభూతులై, నిరుత్సాహులై దిక్కులు పరికించుచుండిరి. వారెల్ల 'చిత్రము! హానీ జరిగినదనుటకు చిహ్నము లేమియు లేవు—గౌరీపతిరావు కుటుంబ మేమైయుండును? అంతయు అద్భుతముగా నున్న దే!' అనువారేగాని పరిశోధించువారు లేరు? శ్యామలరావు మాత్రము మందహాస మొనర్చుచు శిరఃకంపము జేయుచు తీవ్రముఖభావముతో యోచింపుచు యిటునటు జూచుచు పడకగదిలోనికి బోవుచు పెరటిలోనికివచ్చుచు మధ్యచావిడ పరికించుచు పోయినచోటునకే మరలబోవుచు యింటి ప్రహారీ గోడను తిలకించుచు దొడ్డియంతయు దిరుగుచు పెరటిలోని పెంటపోగులును వీక్షింపుచుండెను. అతడట్లు జూచుచుండ అతని దృక్పథమున నేద్దియోబడెను. అతడు దానినిదీసి పరీక్షించుచుండెను. చదువరులారా! అతడు పరికించునదేమి? దొడ్డిలోని పెరటిపై సర్వసాధారణముగా దొరకునదేమి? కాగితపు ముక్కలుగాక మరేమి! శ్యామలరావు పరిశీలించునదియు నట్టిదే! సుదర్శనరావున కేమియు తోచుటలేదు. అతడేమియు స్పష్టముగ చెప్పజాలకుండెను. అతడు శ్యామలరావునుగాంచి 'శ్యామలరావుగారూ! కేసు స్వభావికమంతయు చాల విచిత్రముగానున్నది. ఏది నిర్ధారణ జేయుటకు

ను తగినసిదర్శనములు లేవు. కూనీ కాదనుటకు వీలుకనుపించదు. ఆ చోకీ యేమియు లేదండి; ఏమంటారు' అని బల్కెను.

శ్యామ—అయ్యా! కేసు ఘోరమైనదనుట నిర్వివాదము. కొంత ఆసు దొరికినది. దానిని దృష్టపరచు కొనవలయును. గౌరీపతిరావు సంగతి సందర్భములు విపులముగా తెలియవలయు కావున వీరిని కొన్ని ప్రశ్న లడుగవలయు.

సుద—అభ్యంతరమేమి? అడగండి— అయితే— కూని యనియు—

శ్యా—పచ్చికూనీ! రగము తేరిన చేతులు—కేసు నెమ్మది మీదగాని త్వరలో తేలు స్వభావికము కలది కాదు—ప్రయాసము అధికమే యగును.

సు—సి హెబూ! ఏమో నాకు అగమ్యగోచరముగా నున్నది. అయ్యా! (ఇద్దరు పోలీసు వారివంక జూచి) ఫస్ట్దారుగారు అడుగు ప్రశ్నలకు మీరు తెలియునంతవరకు సమాధానము ఇవ్వవలయును.

ఇ—పో—చిత్తము—అభ్యంతరమేమున్నది.

శ్యా—గౌరీపతిరావున కేయూర బంధువులుగలరా?

ఇ-పో—లేరండి.

శ్యా—ఈయనకు సంతానమెంతమంది?

ఇ-పో—ఇద్దరు కొడుకులు ఒకకూతురు.

శ్యా—వారి వయస్సు?

ఇ-పో—పెద్దవాడికి పా—తి—కేండ్లు ఉండవచ్చును. కూతురుకు ఇరవై—ఆఖరివాడికి పన్నెండును.

శ్యా—గౌరీపతిరావు భార్య జీవించియే యున్నదా?

ఇ-పో—అవునండి.

శ్యా—పెద్దవాడికి పెండ్లి అయినదా?

ఇ-పో—లేదండి.

శ్యా—ఆతనికి చదువు సంధ్యలు లేవుగదా !

ఇ-పో—లేవండి.

శ్యా—గౌరీపతిరావుకు వడ్డీవ్యాపారము కలదుకదా ?

ఇ-పో—కొలది గొప్ప కలదండి.

శ్యా—అయితే-కూతురు యిక్కడనే యున్నదా?

ఇ-పో—అవునండి.

శ్యా—గౌరీపతిరావు మేడఅమ్మిన కారణ మేమైయుండును ?

ఇ-పో—వడ్డీవ్యాపారమునం దాసక్తి ఒకటి. రెండవది విదేశములోనున్న అల్లునకు ద్రవ్యసహాయము చేయుట.

శ్యా—అల్లుడేమి చదువుచుండెను?

ఇ-పో—బారెట్లా.

శ్యా—గౌరీపతిరావు పెద్దకుమారుని పేరేమి ?

ఇ-పో—ప్రకాశరావు.

శ్యా—ఆతనికొరకెవరైన వచ్చుచుండెడి వారా?

ఇ-పో—ఈమధ్య యెవ్వరూ వచ్చుట లేదండి.

శ్యా—ఎందుకు చేతనో ?

ఇ-పో—దుష్టసహవాసములని తండ్రి కేకలువేసినండి.

శ్యా—ఆమధ్య వీరింటికి వచ్చేవారిలో చామనచాయ కలిగి పొడవుగా కొద్దిలావుగాయున్న యువకుడు వచ్చేవాడా ?

ఇ-పో—అంతగా చూడలేదండి.

శ్యా—గోపీనాధు డెప్పుడైన వచ్చుచుండెడి వాడా ?

ఇ-పో—ఎప్పుడును చూడలేదండి.

శ్యా—గౌరీపతిరావుకు బందరులో బంధువులు కలరా ?

ఇ-పో—లేరండి.

శ్యా—సరియే సుదర్శనరావుగారూ! లేవండి—ఈదుండగము గావించిన విషకీటకము నన్ను పగబట్టి, చుట్టుప్రక్కల యందెందో మసలుచుండవలయు. ఈహత్యకావించినవాడు సుప్రసిద్ధనరాంతకుడు-గండరగండడు-ఊహాపోహలయందు, అద్వితీయుడు, సాహసమునందు-అసమానుడై యుండవలయు. ఇప్పుడు నాయభిప్రాయమును స్థిరపరచుటకై రామనాథ్ దుకాణమునకు పోవలయు.

సు—అట్లేపోవుదము-పై సంగతులను మీరెట్లు నిర్ధారణజేయ గలిగితిరి.

శ్యా—మీకన్నియు తెల్పెదను-ఈగృహమును పురపాలక సంఘము వారియధీనము జేయించి, చక్కగా అలుకులు ముగ్గులుపెట్టు యేర్పాటు గావింపుడు.

సు—ఇప్పుడే పురపాలకసంఘాధ్యక్షునకు వ్రాసెదను.

శ్యా—ఊఁ. కానిండు.

సుదర్శనరావుతోడనే, ఒకచీటిని వ్రాసి దానిని పురపాలకసంఘాధ్యక్షున కియ్యమని రక్షకభటునితో జెప్పి, శ్యామలరావుతో మోటారులోని కెక్కెను. మోటారుఅంగడివీథివైపు పోవుచుండెను. మోటారు రామనాథ్ దుకాణముజేరెను. తోడనే రక్షకభటాధికారు లిరువురు నుదిగి, రామనాథ్ దుకాణములోనికి బోయిరి.

శ్యా—రామనాథ్! నీమేనల్లు డెవ్వరు ?

రా—చిత్తము. ఈతడేనండి.

శ్యా—రఘునాథా! నిన్న మీదుకాణము వద్దకు మోటారులో వచ్చినవారిని గుర్తుపట్టితివా ?

రా—తెల్లపాగా బెట్టుకొని డ్రైవరుచెంత కూర్చుండియున్న వానిని మాత్రము గుర్తెరుంగుదును.

శ్యా—అత డెట్లుండును ?

రా—చామనచాయగా విస్తారము లావుగాక సన్నముగా నుండును.

శ్యా—ఎంత పొడవుండును?

రా—ఆతడు మోటారును దిగకుండుటచే, నేనది చెప్పజాలను.

శ్యా—అయితే వారుదుకాణములోనికి రాలేదన్నమాటయే?

రా—లేదండి-మా మామయ్య, కాసులు తీసికొనివెళ్ళి యిచ్చి నాడండి.

శ్యా—పుస్తకములో సంతకం చేయించినాడా?

రా—ఆ, చేయించినాడండి.

శ్యా—ఏదీ! ఆపుస్తక మిటు దెమ్ము.

రామనాథ్, తన చిట్టానుదీసి శ్యామలిరావునకు జూపెను. శ్యామలరావు తన జేబునుండి ఒకయుత్తరమునుదీసి దస్తూరి సరిపోల్చి జూచుచుండెను. ఆతడు మందహాసముతో శిరఃకంప మొనర్చుచుండెను. సుదర్శనరావు దిక్కులు పరికించుచుండెను.

శ్యా—అయ్యా! రామనాథ్ మనతో కార్యస్థానమునకు రావలయును. మనకిచ్చట పనిలేదు.

సు—అందుల కనుగుణమైన నిదర్శనము లేమైన దొరికినవా?

శ్యా—సర్వము తరువాత ముచ్చటించెదను.

సు—సరియే రామనాథ్! నీతో మాకు కొంతపనియున్నది. నీవు మావెంట రావలయు.

రా—చిత్తము. తమసెలవైనచో తప్పునా! నేనేమియు నెరుంగను.

శ్యా—భయపడకుము. రమ్ము.

శ్యామలరావు, సుదర్శనరావు, రామనాథ్ మోటారులో నెక్కిరి. మోటారు కారాగారముఖ్యస్థానము జేరుచుండెను.

## రెండవ ప్రకరణము.

గౌరీపతిరావుకుటుంబ మంతయు, ఒకరాత్రితో మటుమాయ మయ్యెనను యదార్థము నగరునందంతటను, వ్యాప్తమయ్యెను. రామ నాథుని, సర్కిలుయినస్పెక్టరుగారును, వత్తేదారును, మంచిమాటలతో అరష్టుజేసి, కారాగారమునకు గొంపోయిరని, పట్టణము నలుగడల ప్రచురమయ్యె. పౌరులు గౌరీపతిరావు, ఇంటిచుట్టు ప్రదక్షిణజేయుచు, కారాగారకార్యస్థానము జేరుచు పరిపరివిధముల ప్రసంగించుకొనుచుం డిరి. కార్యస్థానమున సర్కిలుయినస్పెక్టరుగాని వత్తేదారునుగాని, రామ నాథ్‌గాని వారి కగపడలేదు. వారెల్ల, రక్షకభటులను జూచిరి. రామనా థునికూర్చి ప్రశ్నింపుచుండ, వారందులకు కేసు మోపుగానున్నదని బదులు చెప్పుచుండిరి. సర్కిలుయినస్పెక్టరుగారును వత్తేదారునును, రామనాథ్‌యు, కార్యస్థానమున, మూలగదిలో గూర్చుని యీక్రింది విధమున ప్రసంగించుకొనుచుండిరి.

సు—ఏమిటండీ! కేసుసంగతి బహువిచిత్రముగానున్నది—ఆ లోచించగా రామనాథ్ నేరస్తుడని తోచుచున్నది.

శ్యా—(మందహాసముతో) చక్కగా యోచించితిరి!

సు—మీకును అట్లే తోచెనా!

శ్యా—అయ్యా! రామనాథ్ నిరపరాధి.

సు—అట్లయిన, ఆతని నెందులకు బట్టితిరి?

శ్యా—వానిని యెరస్టుచేసినటుల ప్రకటించుటకు-ఆతనిని విచా రణ చేయుచున్నటుల కన్పట్టుటకు—ఈయుదంతము నగరునం దంతటను వ్యాప్తముచేయుటకు.

సు—రామనాథ్ నిరపరాధి యనియే స్థిరబరచితిరా?

శ్యా—స్థిరబరచుటేమి? యదార్థము.

సు—మీరెట్లు స్పష్టీకరింపగలరు ?

శ్యా—ఇటుజూడుడు. (జేబులోనుండి ఒకయుత్తరమును దీసి) ఈదస్తూరియు రామనాధ్ చిఠాలోని సంతకమును సరిపోల్చి చూడుడు.

సు—(చూచుచు) రైట్ సో! ఈరెండును ఒక్కరివే. అయితే మీకీయుత్తర మెక్కడదొరికినదండీ!

శ్యా—తరువాత చెప్పెదను. రామనాధ్ దుకాణమునుండి కాసులు కొనినవాడును, ఈయుత్తరము వ్రాసినవాడును ఒక్కడేనా ?

సు—దస్తూరీనిబట్టి చూడగా అంతే తోచుచున్నది.

శ్యా—సరి. ఇప్పు డాయుత్తరమును జదువుడు.

సుదర్శనరావు ఈక్రిందివిధమున చదువుచుండెను.

బందరు.

'ప్రియమిత్రమా ! 1—1—16.

మీ మేడ అమ్మకమయినదా ! నేను అక్కడకు రాకుండగా గనుక అమ్మకమయితే తక్షణమే తంతినిమ్ము. విశేషములు ప్రత్యేకించి మాట్లాడెదను. అతిజరూరు సిరా, వ్రాలు.'

శ్యామలరావుగారూ ! నిజము మీతోబయలుదేరున డీ ? అయితే—ఒక్కటిమాత్రమున్నది.

శ్యా—చిఠాలో 'దారా' అని వ్రాలున్నది. ఇందులో సిరా అని సంతకమున్నది. ఈరెండును వాడి, సరియైన పేరులుగావు. అసలు పేరు యిప్పటిలో తెలియదు. ఒక పెద్దగాంగులీడరు కావలయును. తన సహచరులతో పెరటిగోడలద్వారా లోపల ప్రవేశించి గౌరీపతిరావు కుటుంబమును అంతమొందించి యుండవలయు. గోడప్రక్కకు బండి యొకటి వచ్చియుండును. కళేబరములను బండిలో వేసుకొని తమ నెల వుకు గొంపోయిరి. ఈ కార్యక్రమములో ప్రకాశరావు జేబునుండి హంతకుడు వ్రాసిన వుత్తరము జారిపోవలయు.

సు—అట్లయిన ప్రకాశరావునకును, హంతకునకును స్నేహ ముండవలయు.

శ్యా—ఆ! కపటస్నేహము కలదు. ఆతడీ కార్యముకొరకే ప్రకాశరావుతో మైత్రి కలుపుకొనెను.

సు—ఏమండో! చూడగా అద్భుతమైన కథావిధాన లా గున్నదే!

శ్యా—సందేహమేమి ఈవార్త నిరుపమాన మేధాసంపన్నుడు. సాహసమున అసమానుడు గౌరీపతిరావు కుటుంబకులో ఒక్కరి మాటమాత్రము అనుమానముకాని మిగిలినవారీసరికే యమసదనమున ప్రాతకాపులయిరి.

సు—అవును. ప్రకాశరావేనా!

శ్యా—కాదు. ప్రకాశరావు అప్పు.

సు—అదేమిటండీ ?

శ్యా—అవును. కాంతాకనకములు. ఈ తాపత్రయమంతయు ఎందులకు ? ఇందులకే;

సు—అవును. అయితే, ప్రకాశరావు, అక్క ఇక్కడనే గల దని మొదటనే చెప్పితిరి. మీకెట్లు తెలిసెనండీ;

శ్యా—గౌరిపతిరావుభార్య వయస్సు చెల్లినది, ప్రకాశరావుకు వివాహముకాలేదు. ఆసందర్భములలో, యువతులు ధరించుట కనుకూలమైన జాకెట్లు ఎందుకుండవలయు ?

సు—అహో! శ్యామలరావుగారూ! మీబుద్ధిసూక్ష్మత ఎంత యు ప్రశంసనీయమండీ!

శ్యా—సరి. దానికేమిలెండు గాంగులీడరు వ్రాసిన యుత్తరము నుబట్టి ఆతడు ఈచుట్టుప్రక్కల యున్నటుల తోచుచున్నది. ఉత్తరము లోపల "బందరు" అని వ్రాసెను కాని బందరు తపాలాముద్ర దానిపై లేదు. చూచితిరా ?

సు—లేదు. మరి తంతికూడ యిమ్మని వ్రాసెనండీ !

శ్యా—ఆ. మనలను మోసగించుటకు- తగిన అదునుకొరకు నిరీక్షించుచు వాడు యీయూరనే యుండెను.

సు—ప్రకాశరావు పాపము.

శ్యా—ఆ ప్రకాశరావు నెలహోవిూద జరిగినమాట నిజమే కాని పెద్దపులి పేరంటము బెట్టునండీ ! సారాంశము వినండి. గౌరీపతిరావు కుటుంబమును కూల్చినవాడు, రామనాథ్ దుకాణముపై కాసులు కొన్నవాడు, రామనాథ్ తమ్ముని మాయము జేసినవాడు ఒక్కడే. రామనాథ్ మేడకొనెను. సొమ్ము రిజిస్ట్రారువారిమొసుట నిచ్చెను. సొమ్ము, మేడకూడ, తనకే యుండునని రాత్రి హంతకులను బంపి గౌరీపతిరావు కుటుంబమును అంతమొందించెననియు తనపై అనుమానము లేకుండ తమ్ముని గూడ ఫరారీ చేయించెననియు దొరతనము వారును ప్రజలును ఊహింపక పోరని, మానవ హంతకుడు వేసిన పన్నుగడగాని వేరేమియు కాదు.

సు—అబ్బో; అయితే యిప్పుడు కర్తవ్యమేమిటి ?

శ్యా—రామనాథ్‌ని మన యధీనములో నుంచుకొని రాత్రుల యందు మాత్రము ఇంటికి బంపుచుండవలయు. కేసు విచారణ జరిగించుచుండవలయు. ఇది అతిరహస్యము.

సు—సరి. అది బాగున్నది.

శ్యా—ఇంకొకటి రామనాథ్‌కి, కఠినశిక్ష బడునను వదంతి పుట్టింపవలయు.

సు—సరియే.

తోడనే శ్యామలరావు చివాలున లేచి గృహాభిముఖుడై పోవు చుండెను.

## మూఁడవ ప్రకరణము.

---

రామనాథుని శంకించి రక్షకభటాధికారులు తమ యధీనమునం దుంచికొనిరను సంగతి పట్టణమంతయు వ్యాప్తమయ్యెను. పౌరులు ప్రస్తుత హత్యనుగూర్చి పరిపరివిధముల ప్రసంగించుకొనుచుండిరి.

ద్రవ్య మెట్టికుండగముల కైన సాహసింప జేయుననియు ధన కాంక్ష యుక్తాయుక్తముల తోఁపనీయదనియు, నిలకడమీఁద నిజము బయల్పడుననియు, దొంగను మనిషియే యనియు నెవరికి తోఁచినటుల వారు జెప్పుకొనుచుండిరి.

శ్యామలరావున కారేయి కన్ను మూతపడలేదు. అతడారాత్రి యంతయు పురవీధులన్నియు వివిధరూపముల గ్రుమ్మరుచుండెను. అను మానాస్పదమగు తావులయందెల్ల పొంచిపొంచి జూచుచుండెను. కృష్ణా తీరమంతయు కలయదిరిగెను. పాపము ఆతని కిసుమంతయు హంతకుని జాడ తెలియలేదు. ఆతడు తిరిగి తిరిగి, తూర్పు తెల్లవారుచుండగనే గృహము జేరెను. ఆతని కెద్దియు పాలుపోవకుండెను. మానసమున వివిధ యూహలు తలసూపుచుండెను. ఆసమయమున రక్షకభటుఁడొకడు కొన్ని యుత్తరములనెల్ల దీసుకొని శ్యామలరావున కొసంగెను. ఆతడా యుత్తరములనెల్ల దీసికొని కడపటిదాని నిట్లు జదివె.

శ్యామలరాయా !

దొంగరాముని బట్టిన సుప్రసిద్ధికుడవు నీవే. దొంగరాముని య న్నను నేనే; గోకీపతిరావు కుటుంబమును అంతమొందించినది నేనే; నీ వేడినెత్తురుతో దొంగరామునకు తర్పణమొసగ కంకణమూనినది నేనే; లోకభయంకరుడగు బలేరాముని దారికడ్డువచ్చి మృత్యుగహ్వ రము చొరకుము. నీవారాపుత్రాదులకు దూరముగాకుము.

ఇట్లు, బలేరాముడు.

ఆతడు దానిని పరీక్షించుచు, మందహాసయుతతో శిరఃకంప మొన ర్చుచుండెను. క్రమక్రమంబుగ సూర్యభగవానుడు నభోమండల మధ్యస్థుడగుచుండెను. రామనాథ్ కేసు నేడే విచారణ జరుగునని పురజనులకెల్ల తెలియవచ్చెను. పౌరులు గుంపులు గుంపులుగా జేరి న్యాయస్థానము జేరుచుండిరి. న్యాయవాదులు తమ కేర్పరుపడిన ఉచితాసనములపై గూర్చుండియుండిరి. రక్షకభటులు రామనాథ్‌ని మధ్య నిడుకొని, న్యాయస్థానమున జేరుచుండిరి. శ్యామలరావు, న్యాయస్థానమునకు బోవలయునని మోటారు సైకిలుతో గృహమునుండి బయటకు వచ్చెను. ఆతడు రాజబాటపై నిలువబడి యెద్దియోనిదానించుచుండెను. ఆసమయమున పైనుండి ఒక మోటారుపవనవేగమున విచ్చేయుచుండెను. గృహముచెంతనే నిలుపబడియున్న అపరాధ పరిశోధకుని దృష్టి మోటారుపై బడెను. ఆతడు తదేకదృష్టితో దానిని పరికించుచుండెను. కారు క్రమక్రమంబుగ శ్యామలరావును సమీపించుచుండెను. వారునందొక పాశ్చాత్యుడు చేతియందొక వార్తాపత్రికను ధరించి వెనుకవైపునగూర్చుండెను. డ్రైవరు మోటారును మనోవేగమున బోనిచ్చుచుండెను. వార్తాపత్రికను జూచుచున్న ఆంగ్లయువకుని దృక్పథమున శ్యామలరావు బడెను. ఆతడు గిరుక్కున తననయనద్వయమును వార్తాపత్రికపై మరల్చి, కాలినున్న జోడుతో, డ్రైవరు కూర్చునియున్న భాగమును దట్టెను. ఆతడు వెనుకటివలెనే వార్తాపత్రికను చూచుకొనుచుండెను. కారు శ్యామలరావు ముంగటనుండి తొలకరి మెరుపువోలె పరువిడి బోయెను. శ్యామలరావు నేలమాపుల జూచుచు క్రేగంట పాశ్చాత్యుని పరికించెను. ఆతడును తనవంక నట్లే జూచుచుండు టాతడు గ్రహించెను. శ్యామలరావు శిరమెత్తి కారు బోవుచున్నదెస తీవ్రభావముఖభావముతో గాంచెను. దాని వెనుకవైపునున్న అంకెలు స్పష్టముగ కనబడుచుండెను, గాని, అదృశ్యమగుచుండెను. తోడనే మన

అపరాధ పరిశోధకుడు తనచెంతనున్న మోటారు సైకిలును సుభాలున ఎక్కెను. కారు వెనుకనే సైకిలు బోవుచుండెను. కారు న్యాయస్థానము ప్రక్కనుండియే బోవుచు కొద్ది గమనము నభినయించి మరల తనవాయువేగమును రెట్టించుచుండెను. న్యాయస్థానమునకు బోవలయునని బయల్వెడలిన, అపరాధపరిశోధకుడు ఏమి యూహించుకొనెనో మనము గ్రహింపజాలముగాని, న్యాయస్థానమును జేరక యే మోటారును వెంటాడించుచుండె. కారులోగూర్చొనియున్న, ఆంగ్లేయుడు తల త్రిప్పి వెనుక వైపు జూచెను. మోటారుసైకిలుపై విచ్చేయు శ్యామలరావు నాతడు గ్రహించెను. డ్రైవరుతో ఆతడేమి జెప్పెనో మనమెరుంగము గాని, కారువెనుకటికంటె వేగముగా పరుపిడిబోవుచుండెను. శ్యామలరాయుడది గ్రహించి తన సైకిలువేగమునుకూడ ద్విగిణీకృత మొనర్చెను. ముందు మోటారు, వెనుక సైకిలు బోవుచుండెను. ఒకదానిని మించిన వేగముతో మరొకటి బోవుచుండెను. రెండును, బెజవాడనుండి, మచిలీపట్టణమునకు గల రాజబాటపై పోవుచుండెను. ఒకదానిని మించవలెనని మరొకటిపరువిడి బోవుచుండెను. అట్లే, ఫర్లాంగులు మైళ్ళు దొర్లిపోవుచుండెను. మోటారును సైకిలు పదలుట లేదు. అట్లే ఇరువది నాలుగుమైళ్ళు నాలుగు ఫర్లాంగులు దొర్లిపోయెను. ఆరాజబాటపై వచ్చుచు బోవుబండ్లుగాని, మార్గస్థులుగాని హెచ్చుగా లేకుండుటచే గాబోలు మోటార్లు రెండును పవనవేగమున బోవుచుండెను. కొంతవడికి ఆంగ్లేయుపకునిమోటారు వేగము తగ్గుచుండునటుల కన్పట్టుచుండెను. కన్పట్టుటేమి! మనసైకిలు దానిని సమీపించుచుండెను. కన్నుమూసి తెరచునంతలో, సైకిలు, మోటారును కలుసుకొనెను. మోటారు నెమ్మదిగనే బోవుచుండెను.

ఏమిది? అంత వేగముగ బోవుచున్న మోటారు, ఇప్పుడు మందగమనము నభినయించుచున్న దనిన ఆశ్చర్యముగ నుండెనే! దీనికి కారణ

మెద్ది యేని యుండవచ్చు; నిలకడమీాద బయల్పడకుండునా ! శ్యామల రావు గుభాలున తనమోటారుసైకిలునుండి దిగి మోటారుడ్రైవరును రూక్షవీక్షణముల పరికించుచు, తన చేతినున్న పిస్తోలును స్టాపు కార్ కారు ఆపుము. ఒక్కఅడుగు ముందుజాగిన నీవుండవు. జాగ్రత్త అని గంభీరముగా బలికెను. డ్రైవరు తెల తెల బోయి, దిక్కులు పరికిం చుచు, మోటారు నాపెను. లోనున్న ఆంగ్లేయుడు తీవ్రదుఃఖభావముతో బయట కురికెను వారిరువురును ఒండొరులను కొంతతడవట్లే వీక్షించుచు ఈక్రిందివిధమున ప్రసంగింప దొడగిరి.

ఆ—అయ్యా, కారును ఆపుమనిన దెందులకు ?

శ్యా—పనియున్నది కావున.

ఆ—ఎవ్వరితో ?

శ్యా—ఎవ్వరితోడనో ఐనయెడల మీాకారు ఆపుటెందులకు మీాతోడనే.

ఆ—మమ్ము ఆపుచేయుటకు మీాకుగల సామంతమేమి ?

శ్యా—నా సామంతము సంగతి తరువాత మాట్లాడెదను. నే నడుగుప్రశ్నలకు మీారు సదుత్తరవు ఇయ్యవలయు.

ఆ—ఏమి ? ఈనిరంకుశాధికారము ! అయ్యా ! మీారెవ్వరు

శ్యా—నేనెవ్వరైనది మున్ముందు మీాకే తెలియగలదు.

ఆ— నా కార్యమునకు అంతరాయము గల్గించుచున్నారు. నష్టమునకు బాధ్యులు కాగలరు.

శ్యా—కానిండు—మీా దేయూరు ?

ఆ—బందరు.

శ్యా— మీా పేరు ?

ఆ—సామ్సను.

శ్యా—మీా రేమిచేయుదురు ?

ఆ—వ రక్తము.

శ్యా—ఏమివ రక్తము ?

ఆ—తోళ్ళవ రక్తము.

శ్యా—మీరు బెజవాడవచ్చిన పనియేమి ?

ఆ—మాపనులు మీకు చెప్పవలయునా?

శ్యా—ఆ. చెప్పితీరవలయు. సహేతుకరముగా లేకున్న ముప్పు రాగలదు.

ఆ—తమరు అపరాధ పరిశోధకులా !

శ్యా—ఆప్రశ్న మీకు సహకారి కాజాలదు.

ఆ—అవును. మీకెట్లు తెలియును ?

ఆ—ఆ. అపరాధ పరిశోధక శిరోమణియగు మీపేరు క్రొత్తయగుటెట్లు ?

శ్యా—ఓహో! దానికేమిగాని మీరు బెజవాడవచ్చిన పనియేమి ?

ఆ—ట్రాఫికు సూపరింటెండెంటుగారితో మాట్లాడుటకు.

శ్యా—ఏ విషయమున ?

ఆ—ఆయన స్నేహితుడే నాసును స్నేహితుడే. ఆయన మదరాసులో కలరు. మొన్న నేను మదరాసు బోయినప్పుడు ఆయన, తన మాటలుగా, ట్రాఫికు సూపరెండెంటు గారితో కొన్ని సంగతులు చెప్పమనెను. అందులకై పోయియుంటిని.

శ్యా—ఏమిసంగతులు.

ఆ—నా స్నేహితుని చెల్లెలు వివాహవిషయమై.

శ్యా—సూపరెండెంటు గారికిని మీకును పరిచయముకలదా !

ఆ—కొద్ది.

శ్యా—అదెట్లు సంభవించెను ?

ఆ—మేమిరువ్వురము, ఒకప్పుడు నా స్నేహితుని యింట రాసులోనే కలుసు కొంటిమి. అప్పుడు అతడే మనుష్యుల నిరువ్వు రిండొరులకు ఎరుక జేసెను.

శ్యా—ఓహో ! అదియా ! సూపరెండెంటు కనుపించెనా !

ఆ—ఆ. మాట్లాడు కొంటిమి.

శ్యా—అయితే మీర్లారు ఆఖరిదఫా చెన్నపట్నంవెళ్ళిన దెప్పుడు?

ఆ—మొన్న 14 వ తారీఖున అక్కడనే యుంటిమి.

శ్యా—సరి-పెళ్ళిసందర్భ మేమైనది.

ఆ—సూపరెండెంటు గారికి ఇష్టముగానే యున్నది కాని, కొమారుడేమనునో యని కాబోలు కొంతగడవు కోరినారు.

శ్యా—అయితే, ఆయన కుమారునకా ఈసంబంధము?

ఆ—అవునండి.

శ్యా—ఆయనేమి చేయుచున్నాడు ?

ఆ—రైల్వే ఇంజనీరు.

శ్యా—బాగున్నది. మీరుపట్నమునుండి వచ్చినదెప్పుడు.

ఆ—నేనా, పండ్రెండో తారీఖున-కాదు పదహారు-ఆ-పదినాలుగు-అవును. అంతే-

శ్యా—అదేమి తడబడు చున్నారు.

ఆ—అబ్బే ! సరిగా జ్ఞప్తి జాలక.

శ్యా—మన సూపరెండెంటుగారి పేరేమి ?

ఆ—బ్రౌను.

శ్యా—సూపరెండెంటు పేరు బ్రౌనా ?

ఆ—ఆ. కాదు బేరి.

శ్యా—అయితే మీరు తోళ్ళవ్యాపారం చాలాబాహుళ్యంగా చేస్తారన్న మాటయే.

ఆ—చిత్తము.

శ్యా—సరి-అనుమానం తీరినదిగాని మాకు ఒకటోరకమైన కోర్కెము (ఖెదగు)తోలు సప్లయి చేయగలరా!

ఆ—మీకునచ్చినరకం కావలసినప్పుడు ఎంతయినా అంద చేస్తాను.

శ్యా—మిమ్ములను నేను పరీక్ష చేసినందులకు నన్ను మన్నించ వలయును. దిగినకాని లోతు తెలియదుగదా! ఆపైని మా వ్యాపా రము నకు మొగమాటము పనికిరాదు.

ఆ—ఆ, దాని కేమి లెండు.

శ్యా—బాబు! మీ (యెడ్రస్సు) చిరునామా చిన్న కాగితము మీద వ్రాసియివ్వండి.

ఆ—చిత్తము.

సామ్సను తనడ్రైవరువంక క్రీగంట జూచి తన జేబునందున్న పుస్తకమును దీసి అందొక కాగితమునుచింపి, తనచిరునామా వ్రాయు చుండెను. శ్యామలరావు, శిరమువంచి, దానిని పరీక్షించుచుండెను.

ఆసమయమున వెనుకవైపు నుండి 'ఢాం' అనేశబ్దము వెలు వెడలి, చుట్టుప్రక్కలంతయు నల్లనిపొగ దయ్యగమ్ముచు, ఏకగుండు శ్యామలరావును దూసుకొని పోయెను. పిస్తోలును గాల్చుట యందు నిపుణత్వము లేనో, లేక శ్యామలరాయుని, యదృష్టమునసో లేక మాదృష్టిమాంద్యమునసో, కండ్లునోలె మానయనములుకూడ చీకట్లు క్రమ్ముటనోగాని అతని యవయవములనుండి, గుండు పోయినటుల మాకగపడలేదు గాని, శ్యామలరావు మాత్రము భూమిపై, గుభాలున పడి పోయెను. శ్యామలరావునకు దెబ్బతగులలేదని భావించుటెట్లు? సామ్సనుతోడనే,శ్యామలరావు వెనుక వైపునున్న డ్రైవరునుబిలిచి ఈత నిని, కారులో బడవేయవలయు!'అని బలికెను. అందులకాతడు శిరఃకంపు మొనర్ప, వారిరువురును శ్యామలరాయుని యెత్తుకొని కారులో పరుండ

బెట్టిరి. సామ్సను తన కోటుజేబునుండి, ఒకసీసానుదీసి, శ్యామలరాయుని ఘ్రాణేంద్రియములముంగల బెట్టుచు డ్రైవరునిజూచి "నీ వామోటారు సైకిలుమీద కానబడు గ్రామముజేరి మునసబు, కరణములను తక్షణమే అపరాధపరిశోధకుడు రమ్మనెనని జెప్పి, వెంటబెట్టుకు రావలయు.

ఇదంతయు, కన్నుమూసి తెరచునంతలో జరుగవలయు ననిబల్కెను. తోడనే డ్రైవరు మోటారునెక్కి పవనవేగమున బోవుచుండెను. అతడు త్రుటికాలములో పరిసరగ్రామము జేరి మునసబు కరణములను గాంచి, సామ్సను ఆజ్ఞ దెల్పెను. వారిరువురకు సామ్సనునుజేర డ్రైవరుతో పయనమైబోవుచుండి కొంతవడి వారు మువ్వురును సామ్సనును కలసుకొనిరి. మునసబు కరణములు సామ్సనుకు అభివాదమొనర్చి,నిలువబడిరి. సామ్సను వారలనుగాంచి 'అయ్యా! మీరీ మోటారు సైకిలును గ్రామనౌకరులచే బెజవాడ పోలీసు స్టేషనుకు బంపవలయు మొన్నటి బెజవాడ కూనీకేసులో నేరస్థుడు దీనిపై పరారీయగుచుండ యిక్కడ బట్టుకొంటిని. నేను, డ్రైవరు మాంతకుడు తిరుగ బెజవాడ ఈకారు మీదనే బోవుదుము. మీరు వెనుకనుండి సైకిలును బంపుడు, అని బలికి ఒక తెల్లకాగితముపై నెద్దియోవ్రాసి వారికిచ్చి మోటారునెక్కెను. డ్రైవరు తన వెనుకటిస్థానము జేరెను. మోటారు తిరుగుముఖము బట్టి బెజవాడ బోవుచుండెను మోటారు యెంతవేగముగా పరుగెత్తగలదో తన సామర్థ్యము జూపుచు బోవుచుండెను. ఇప్పుడు సామ్సను మాత్రము డ్రైవరుప్రక్కనే గూర్చుండి యుండెను. శ్యామలరావును పరుండబెట్టిన వెనుకతట్టు పరులకు గానరాకుండ కాబోలు కీలుగుడ్డను జారవైచిరి. మోటారు పామగ్రు సమీపించుచుండెను. ఆసమయమున సామ్సను డ్రైవరునుజూచి 'కారు ఆపుము. నీవు తక్షణమే పామగ్రుతపాలాఫీసుకుబోయి ఈతంతి నొసంగుము. అని బలికి' యాతని చేతికేమి

మోటారువాసియిచ్చెను. డ్రైవరు, తన స్థానమునుండి దిగి కాలినడకను పామన్రు జేరుచుండెను. సామ్సను కారును స్వయముగానే నడిపించుకొని బోవుచుండెను. కారు సమీపించుచుండెను. బెజవాడ, డి. పి. డబ్లుయు, సూపరెంటెండెంటు కార్యస్థానము ప్రక్కనుండి, తూర్పుగాగల రాజబాటవైపు బోవుచుండెను. ఆబాటకు సుమారు ఒక మైలదూరమున పెద్దకొండగలదు. రాజబాట కొండప్రక్క నుండియే, పోవుచుండెను. మనమోటారు ఆపర్వతముజుట్టును ప్రదక్షిణజేసి, రాజబాటను వదలి, చిన్న చిన్న రాళ్ళపై నుండియు పచ్చికనవు మీద నుండియు డొంకలను, తరులతాగుల్మములను దప్పించుకొనుచు, ఆమార్గమున పూర్వము అలవడి యున్నటుల బోవుచుండెను. మోటారు ఆప్రదేశమున బోవుట కిసుమంతయు వెనుదీయుట లేదు. దానిని నడిపించుటకు సామ్సను జంకుటయు లేదు. అట్లే సుమారు మూడుమైళ్ళవరకును కారు సాగిపోయి త్రికోణాకారముగ మూడు, అత్యున్నత పర్వతములు కలసియున్న తావుజేరెను. ఆపరిసరములందెచ్చటను ఊరుగాని, పల్లెగాని లేదు. మనుష్యసంచార మగపడకుండుట కేవలము గొప్పపర్వతముగనే పరిగణింప వచ్చును. ఆ పర్వతప్రాంత ప్రదేశము జేరి కారు నిలచెను. సామ్సను గుభాలున కారుపైనుండి పుడమిపై దురికెను. అందెందును తలుపుగాని, ద్వారముగాని, ఆకొండలలోనికి కానుపింపదు; కాని, కన్నులో కన్నుపెట్టి జూచిన భూమిమట్టమునకు సరాసరిగా, బహుయుక్తియుక్తముగా, అమర్పబడియున్న తలుపుపొడగట్టక మానదు. మన సామ్సను ఆతలుపును గట్టిగా నాలుగయిదు తన్నులు దన్నెను. తోడనే కిటుక్కుమను శబ్దము బయల్వెడలెను. సామ్సను, మోటారునెక్కెను. పర్వతద్వారము తెరువబడెను. మోటారు మెల్ల మెల్లన లోనికిబోవుచుండెను. లోనంతయు గాఢాంధకారము నిమ్నోన్నతము సామ్సను జేబునుండి విద్యుచ్ఛక్తి దీపికను దీసి ముట్టించెను కటికచీకటంతయు, పుస్త

మ రేయివలె నయ్యెను. కాని బండిలోనికి పోవగానే ద్వారమునూసు కొని పోయెను.

చదువరులారా! రహస్యమందిర ద్వారము బాధింపడెను. లోనుండు చిత్రవిచిత్రములను మనము గాంచు టెట్లు? ఈపాతాళగృహమే హంతకుల రహస్యమందిరమని మీహృదయములు ఘోషింపలేవా! ఈ సామ్మనే హంతకచక్రవర్తియనియు, సుప్రసిద్ధనరాంతకు డనియు, ఇతని హృదయ విచారితకలుషములు, మీహృదయ దర్పణముల ప్రతిబింబితమై నిరూపించుటలేవా! కానిండు. మనమేల వేగిరపడవలయు. మన మీద్వారముచెంతనే నిలువబడి, లోపల జరుగు సంభాషణ మెలకువతో ఆలకించిన సర్వము తేటపడగలదు. ప్రత్యక్షముగ గాంచుటకు వలను లేకుండ పోయెగాని, వినుట కభ్యంతరము కలుగ లేదుకదా! ఈ సామ్ముని మందిర ప్రదేశము మరొక్కమారు గావింపవచ్చును గాని ప్రస్తుతమున మాత్రము అసందర్భమే

“ భైరవా! నేనుపోయిన పిమ్మట నగరులోని విశేషము లేమి?

భై—దొరా! రామనాథ్ కేసు విచారణ జరగలేదు.

దొ—ఎట్లు జరుగును? వాయిదా వేసెనా?

భై—మళ్ళీ యీరోజుకు.

దొ—ఓహో! ఎంతయుక్తి! అయితే సుదర్శనరావు ఇప్పుడెక్కడున్నాడు?

భై—స్టేషనులోనే!

దొ—ఆమూలగదిలో గుప్పెడు మెతుకులు పారవేయించితివా?

భై—ఇంత క్రితమే.

దొ—ఇదిగో! వాడిని యీమూట్టన యెత్తుకొనిపోయి పక్కగదిలో పారవేసి తాళము వేయుము. నేతిరిగి వచ్చేవరకు నీరయిన బోయకుము.

భై—నిత్తము.

దొ—తరువాత-ఆ దేవదారుపెట్టెలను కారులో బెట్టుము.

భై—మూడుపెట్టెలు గూడానా?

దొ—ఊఁ. మూడింటిని. రంగడు వచ్చిన యిక్కడనే యుండమను.

భై—రంగడు ఎక్కడికి పోయినాడు?

దొ—తంతి నిచ్చుటకు పంపినానులే.

భై—అయితే-వాళ్ళని ఇద్దరినీకూడా-రాజమండ్రి-

దొ—ఇప్పుడా ప్రస్తావనవద్దు- నీకు మైరావణుడు-కారులో నేను వస్తూయుంటే నన్ను పసిగట్టి వెంటాడించాడు.

భై—వీడెల్లా గ్రహించాడో!

దొ—నేను వాడిని చూచి కారును జోరుగా పోనియ్య మని కాలుతో ఇట్టే అన్నాను. అది చూచి నా వెంట బడ్డాడు. తరువాత నా దస్తూరీ నమోనా చూచి, అరస్టు చెయ్యాలని భావించాడు.

భై—అబ్బా! అందుకే, అనర్థం అయింది.

దొ—దొంగరాముడిని పట్టికల్లాగ్యాలని మొగసిపడుతున్నాడు. పాపము నన్నుకూడా సాధించాలని భ్రమపడ్డాడు. సరి దాని కేంగాని, ఇప్పుడు కారు నెంబరు మార్చాలి నేను దుస్తులను మార్చుకు వచ్చేలోపులో, నీవు ఇవన్నీ జరిగించాలి.

భై—నిముషములలో చేస్తాను.

అప్పటికి సుమారు మధ్యాహ్నము నాలుగుగంటలు కావచ్చును. లోపలనుండి మాట లేమియు వినిపించుట లేదు; కాని పదినిమిషములకు మాత్రము కారు బయలుదేరు చప్పుడు వినవచ్చెను. విచిత్రబిలమునుండి మరల కారు వెలువడుటకు గుహాద్వారము తెరువబడి కారు బయటికి వచ్చె. అందులో ఒకపురుషుడు మాత్రమే కూర్చుం

డెను. మూడుదేవదారుపెట్టెలు గలవు. ఈతడు మనసామ్రాను కాడు. సంగతిసందర్భములను యోచించిన ఈతడెవ్వరో మీకు తెలియకపోదు.

ఇదివరలో వచ్చినమార్గముననే కారు పరుగిడపోవు చుండెను. అయ్యది క్రమక్రమంబుగ రాజవీధులనెల్ల అతిక్రమించి, కారాగార కార్యస్థానము జేరుచుండెను. సుదర్శనరావు కుర్చీపై గూర్చుండి తంతి పత్రమును జదువుకొను చుండెను. మన యువకుడు కారుకు స్టేషను వద్ద నిలిపి లోనికి బోవుచుండెను. ఆతడు సుదర్శనరావును గాంచి నమస్కరించి నిలువబడి యుండెను.

సుదర్శనరావు తలయెత్తి తలకట్టెదుట నున్న పురుషుని గాంచెను.

సు— నీ వెవ్వరు ?

—బాండిలీనండి.

నీ పేరు ?

భవానీ ప్రసాదండి.

ఏయూరు?

బందరు.

ఇక్కడ నీకు పనియేమి ?

శ్యామలిరావుగారు, ఈ సామానులను స్టేషనులో వప్పగించమని శెలవిచ్చారండి తమకు తంతికూడ ఇచ్చామని చెప్పియున్నారండి.

ఎక్కడ చెప్పినారు.

పామర్రు లోనండి.

నీ వెక్కడికి బోవుచుంటివి ?

పామర్రో వచ్చామండి.

ఎందులకు ?

ఈ కారు యజమాని అత్తవారు సామర్లండి- వారి భార్యా బిడ్డలను బందరునుండి సామర్ల పుట్టినింటికి తీసుకువచ్చారండి.

ఆయన పేరు?

పువ్వుల రంగస్వామి గారండి.

నీ కారు నెంబ రెంత ?

1446 అండి.

శ్యామలీరావుగారు ఏంచేస్తున్నారు ?

146 ఇంటిగోడను తవ్విస్తున్నారండి.

ఓహో ! నీ ఇంటి పేరు ?

గిరజా వారు.

నీవు వ్రాయగలవా ?

చేత కాదండి.

సరి.

సుదర్శనరావు తోడనే హెడ్ కానిస్టబులను బిలిచి 'ఆకారులో సామానులు స్టేషనులో బెట్టించి, ఆతనికి రసీదు నిమ్ము అతనిచే నీ పుస్తకమున వ్రేలుముద్దర వేయించుకొనుము అని' పల్కెను.

హె. కా—చిత్తము. అందులో తంతిమాటకూడ వ్రాయవలె నాండి.

సు—ఊ. వ్రాయుము.

హెడ్ కానస్టబులు, తనవారి నిద్దరిని బిలచి కారులో పెట్టెలను స్టేషనులో బెట్టించి, భవానీ ప్రసాదుని కిట్లు చీటినివ్రాసి ఇచ్చెను.

కారు నెం॥ 1446 డ్రైవరు, శ్యామలీరావుగారి తంతిప్రకారం నాలుగు పేకోజిపెట్టెలు బట్టుకొని వచ్చి ఇచ్చినాడు. గనుక ముట్టినవి.

మహమ్మదు హుస్సేను, వ్రాలు అనివ్రాసి అతనికిచ్చెను. భవానీప్రసాదుచే తనపుస్తకమునందు వ్రేలుముద్దరలు వేయించుకొనెను.

తదుపరి, భవానీ ప్రసాదు సుదర్శనరావుగారిని జూచి "అయ్యా! సెలవు, దయచేయుడు" అని పల్కెను. సుదర్శనరావు "మంచిది" అని బల్కెను. భవానిప్రసాదు, గిరుక్కునదిరిగి మోటారు నెక్కెను. ఆతని మోమున మందహాసము తలసూపుచుండెను. తృటిలో, కారును, భవానీప్రసాదుడును అదృశ్యమైరి.

---

## నాలుగవ ప్రకరణము.

---

సాయంసమయము కావచ్చెను. సుదర్శనరావు యింతదనుక ఏద్దియో వ్రాసుకొని వ్రాతను ముగించెను. ఆతడు గృహము జేరవలయునని తన పీఠముపై నుండి లేచెను. ఆసమయమున మోటారు సైకిలును తీసుకొని, యొకమనిషి స్టేషనులోనికి వచ్చుచుండెను. ఇంటికి బోవనున్న సుదర్శనరావాపురుషుని శిలకించి నిర్ఘాంతపోయి యీ క్రిందివిధమున ప్రశ్నించెను.

సు—ఓయీ ! నీదేయూరు ?

పు—కంకిపాడు—మహాప్రభో.

సు— నీ వెవ్వరవు ?

పు—నాయకుడను.

సు—సైకిలు యెవ్వరిది? సమాచార మేమిటి ?

నా—ఈసైకిలు మీదండీ, మొన్నకూనీ కేసులో దొంగ పారిపోవుచుండగా తహశ్శీదారుడుగారు మోటారుమీద వచ్చి, మా గ్రామం పొలిమేరలో వానిని గుండుబెట్టికాల్చి వానిని తమ మోటారులో వేసుకొని మునసబు కరణములకు కబురువంపి ఈ సైకిలును స్టేషనుకు పంప మన్నారండి. తహశ్శీదారుడుగారు మా మునసబు కరణములకు ఇచ్చిన తాకీదు వారు నాచేతికిచ్చిన ఉత్తరం అన్నీ ఇవిగోనండి.

సుదర్శనరావు స్తంభించి పోయెను. ఆతని మానసము క్రోధశోక రసము... లయము మయ్యెను. శ్యామలరావునకు ముప్పు వాటిల్లెనని యాత డూహించెను.

సు—ఓరీ! మీ గ్రామ సరిహద్దునకు మోటారుపై వచ్చిన షత్తేదారు డెట్లుండెను?

నా—నల్లగా ఉంటారండీ దొరగారిటోపి? యున్నదండీ.

సు—ఔరా! ఇంకను సందేహమేమి?

ఎంతచిత్రము పామర్రునుండి తంతినొసంగెనా! కంకిపాడు నాయకుని మోటారుసైకిలు స్టేషనుకు తెప్పించెనా! తాను మోటారు మీది పెట్టెలను దీసికొనివచ్చెనా! ఔరా! నేను కూపమున గూలిపోతిని. శ్యామలరావు మృత్యుగహ్వరము జేరెను. అబ్బ! ఎంతటిపన్నగడ! ఏమి గుండెనిబ్బరము. మీ బోంట్లే ఈ హంతకునిచే వంచింపబడుచుండ ప్రజలు వీని మాయోపాయముల నమసిపోవుటకు ఆశ్చర్యమేముండును, అహో! మోటారుడ్రైవరని భావించితిని. శ్యామలరావు తంతి నిజమనియే యూహించితిని! ఈ యుత్తరములయం దేమిగలదో!

'కంకిపాడు మునసబు కరణములకు తాకీదు.

హంతకుడు మీ గ్రామసరిహద్దున చిక్కినాడు. నేను వానిని బెజవాడ గొంపోవుచున్నాను. ఆతని మోటారుసైకిలును వెనుకనుండి స్టేషనుకు పంపవలెను.

ఇట్లు
'సామ్సన్ ప్రాలు'
షత్తేదారుడు.

ఔరా! ఎంతటియుక్తి? ఎంతటిసాహసము. కానిమ్ము. 'మునసబు కరణము లేమి వ్రాసిరో చూడవలయును' నతడిట్లు చదువుకొనెను.

బెజవాడ, షత్తేదారుడుగారి దివ్యసముఖమునకు.

తమ సెలవుప్రకారం, మోటారుసైకిలును గ్రామనౌకరుద్వారా స్టేషనుకు పంపుకొనడమైనది. అందినట్లు రశీదుపంప గోరుచున్నాము.

విధేయులు,

దుడ్డు బసవయ్య, (మునసబు)
నగిషీ పాపారావు, (కరణం)

సుదర్శనరావు, మోముకసిగందెను. ఆతడు ఔరా! ఎంతటి మేధాశక్తి! హంతకుడవనిన నీవే! ఈ పేటికలయందు తప్పక గౌరీపతి రావు కుటుంబము దీర్ఘనిద్ర బోవుచుండవలయు తోడనే యాతడు 256, 567, మోటారుడ్రైవరు ఇచ్చినపెట్టెలను బ్రద్దలుకొట్టుడు.' అని బల్కెను.

తోడనే యా రక్షకభటులిరువురును, సాధనసామగ్రులను గొని వచ్చి, యా పెట్టెలను బద్దలుకొట్టిరి. పేటికలనుండి తొలుత సుగంధము బయల్వెడలి, తదుపరి దుర్గంధమున, మిళితమై, సహజ సత్వమును కోల్పోయి, అందున్న వారి ఘ్రాణేంద్రియముల పగులగొట్ట సాగెను. ప్రేక్షకుల దృష్టియంతయు పెట్టెలపై బడెను. ఎల్లరు నిర్ఘాంతపోయి జూచుచుండిరి. సుదర్శనరావు నోటమాటలేక స్తంభించిపోయెను. ఆ పెట్టెలు నిరూపించు ఘోరప్రదర్శనమేమి ?

మొదటిదానియందు, ప్రకాశరావు, దామోదరరావుల కళేబర ములను, రెండవదానియందు గౌరీపతిరావుగారు శరీరమును మూడవ దానియందు గౌరీపతిరావు అర్థాంగియు దీర్ఘనిద్రబోవు చుండిరి. ఆకళే బరములకంఠములు పూర్తిగ నులిమివేయబడి, మెలికలుదిరిగి యుండెను.

సుదర్శనరావు నోటమాటలేదు. ఆత డాశవములను రెప్పవాల్పక జూచుచుండెను. ఎల్లరు నిర్జీవప్రతిమలువోలె కన్పట్టు చుండిరి. సుదర్శన రావునకు, శ్యామలీరావు, ఇదివరలో నివేదించిన సంగతులెల్ల యథా ర్థములని, కట్టెదుటనే శోచనీయప్రదర్శనము ద్రృఢీకరించుచుండెను.

అతడు శ్యామలరాయుని మేధాశక్తి కచ్చెరువందుచు, ఆతని ప్రస్తుత యునికిని గూర్చి చింతించుచుండెను. పాపము ఆతనికి సర్వము బోధపడె ను. కర్తవ్యము తోపకుండెను. మానసము, వివిధయూహాలు జనించి మనశ్శాంతిని చిందరవందర జేయుచుండెను. అతడిట్లుండ, ఆతని చూ డ్కులు పేటికమూతపై బడెను. ఆతడు దాని నిట్లు జదువుకొనెను.

'శ్యామలరాయా !'

దొంగరాముని జంపినది నీవు. దొంగరాముని యన్నను నేనే. ఈ ఘోరహత్యలుగావించినది నేనే. నీ వేడినెత్తురులో దొంగరామునకి తర్పణమొదలి భ్రాతఋణముదీర్పనున్నది నేనే నాపేరు బలేరాముడు. సుదర్శనరావు నిరుత్తరుండయ్యెను. ఆతనికి కర్తవ్యమేమియు బోధపడ కుండెను. మోము జేవురించి స్వేదసంకిలితమయ్యెను. ఆత డొక్కనిమిష ము యోచించి 142, అని బిలిచెను. తోడనే యొకరక్షకభటుడు పరుగుపరుగునవచ్చి యాతని మోల నిలువబడెను.సుదర్శన రావాతనిని గాంచి 'నీవు తక్షణమే తంతినిలయమునకు బోయి సూపరిండెంటుగారికీ విధమున తంతినిమ్ము.' అని యీక్రిందివిధమున వ్రాసెను.

'బెజవాడ స్టేటుమెకున్ప్రెస్,

డిటెక్టివు కాల్పబడెను. నాలుగు శవములు,

స్టేషను జేరినవి. అపరాధి దాటిపోయెను.

అప్పుడు మధ్యాహ్నము సుమారు మూడుగంటలగును. రక్షక భటు డాతంతిని, గొనిపోవుచుండెను.

తదుపరి సుదర్శనరావు, కార్యస్థానమందున్న రక్షకభటులను జూచి "నేవచ్చువరకు ఈ పేటికల నిట్లేయుంచుడు" అని బలికి శ్యామలి రావు మోటారుసైకిలుమీద కంకిపాడు పయనమై బోవుచుండెను. ఆతడు తిన్నగ కంకిపాడుజేరి, మునసబుకరణమువద్దనుంచి, జరిగిన వృత్తాంతమంతయు, దెలుసుకొనెను. కంకిపాడు నాయకుడు చెప్పిన దాని

కిని, గ్రామాధికారులు వెలిబుచ్చిన దానికిని వ్యత్యాసమూవంతయు కనుపట్టలేదు. తోడనే యాతడు, మునసబుకరణముల వద్దనుంచి, జరిగిన యదార్థమంతయు వ్రాతమూలకముగా దీసుకొని, బెజవాడజేరుచుండెను. సుదర్శనరావు పంపినతంతి, సూపరిండెంటుగారికి, అయిదుగంటలకే అందెను. అపరాధపరిశోధక శిరోమణియగు శ్యామలరావునకు గుండు దెబ్బ తగిలెనని, సూపరిండెంటు క్రోధసముద్రమున ఘూర్ణిల్లెను. అపరాధి పలాయన మయ్యెనని చింతిచెను. ఆతడు తక్షణమే, తనమోటారుపై బెజవాడ పయనమయ్యెను. రాత్రి యేడుగంట లగుసరికి సూపరిండెంటు, బెజవాడ కారాగారకార్యస్థానము జేరెను. సుదర్శనరావు అందే తన యధికారిరాకకు కాచుకొని వేచియుండెను. సుదర్శనరావు, జరిగిన చర్యఅంతయు పూసగ్రుచ్చినట్లుగా సూపరిండెంటుకు విసికిడి జేసెను. సూపరిండెంటుకు శ్యామలరాయుని శక్తిసామర్థ్యములు విపులముగా దెలియుటచే శ్యామలరావు చనిపోయి యుండరాదని యూహించెను. అట్టిప్రమాదమే సంభవించు నేని, అపరాధపరిశోధక శాఖకు తీరని లోటని యెంచుచుండెను. హంతకుడు, గండరగండడని శిరఃకంప మొనర్చుచుండెను.

అతడు నగరులోని, రక్షకభటాదికారులను, సుదర్శనరావును బిలిచి "మీరు చేదోడుగా నిరువురుకర్తేవారులను పంపెను. అపరాధి విషయమై, అపరాధిపరిశోధకుని విషయమై తీవ్రకృషిజేసి, ఎప్పటివర్తమాన మప్పుడు నాకందుచుండవలయు. మీశక్తిసామర్థ్యముల శోధించు తరుణము. ఈశవముల ఛాయాపటములను తీసితిరి. కావున దహనాది క్రియలు జరుగువేర్పాట్లు జేయుడు."అని గట్టిగా నుత్తరవుజేసి సూపరిండెంటు తన మోటారుసైకిలు అధిష్ఠించెను. సుదర్శనరావును, రక్షకభటాధికారులును తమతమ పనులపై బోవుచుండిరి. చదువరులారా! పౌరులు ప్రస్తుతిహత్యలను, హంతకుని యద్వితీయసాహసమును గర్శ

నిర్భేదకకృత్యములను దలంచి యెట్టులడిల్లుచుండిరో. ప్రజాక్లేశనాశంకదీక్షాపరతంత్రుడగు శ్యామలరాయుని గూర్చియెట్లు "ఆహాకారము లుప్పతిల్లుచుండెనో మీా హృదయదర్పణముల మీాయ కనుగొనవలయు గాని మాకు వర్ణనాతీతము.

---

## అయిదవ ప్రకరణము.

---

సామ్సను అనునాతడే చోరనాయకుడనియు, అతని కాపురము మన విచిత్రబిలమనియు మా చదువరు లిదివరకె గ్రహించి యున్నారు. ఈతడే మన కథానాయకుడు. ఈతని పేరే బలేరాముడు. కాని యిప్పుడు సామ్సను అను పేరుతో బాహ్యానటన కనుగుణ్యముగ వర్తించుచున్నాడు. ఈత డింకను, తన కార్యక్రమమును జరిగించుటలో యెన్ని వేషములుధరించునో, మనకు దెలియదు కావున మనము జాగరూకతతో నీతని పరిశీలింపవలసి యున్నది.

ఈతడు దొంగరాముని యన్న. ఆతని ఆధిపత్యమున ఇనూర్లు మంది యెన్నికగన్న తస్కరులు కలరు. వారినెల్ల వివిధజట్టులక్రింద విభజించి వారలచే కన్నములు వేయించుచు, ఘోరహత్యలు గావించుచు ధనమార్జించు చుండును. బలేరాము డనిన దొంగలకెల్ల గర్భనిర్భేదము. దొంగరాముడు చనిపోయిన దాది ఆతని యనుచరులకు ఈతడే దొంగరాముడు లేని లోటుదీర్చుచు, రెండుజట్టులను ఏకత్రాటిమీాద నడుపుచుండెను.

ఆతడు రాజమహేంద్రవరము వచ్చుచు బోవుచుండును. ఇప్పుడతడు బెజవాడయందు లేడు. క్రమక్రమంబుగ గాఢాంధకారము దిక్తటముల నలుముకొని కన్నును మిన్నును గానరాకుండ జేయుచుండెను బలేరాముని యనుచరులకు చీకటిప్రబలిన కొలందిని యుత్సాహము మిఠి

మీారుచుండెను. బెజవాడరాజవీధుల యందెల్ల నిశ్శబ్దము నిరంకుశాధి కార మొనర్చుచుండెను. కాని మధ్యమధ్య రక్షకభటుల యీలలు మాత్రము వినవచ్చుచుండెను. వారెల్ల తమ తమ పనులపై పట్టణప్ర వేశము గావించుచుండిరి. చదువరులారా! శ్యామలరావు విచిత్రబిల మున బంధింపబడుట మనకెల్లరకు విదితమైన విషయముచే కదా! శ్యామల రావుకు గుండుదెబ్బ తగులలేదా! ఆతడు భూమిపై గూలుట మనము ప్రత్యక్షముగ గాంచలేదా! శ్యామలరావు సజీవుడై యుండెనా! అదియే చిత్రము మహామహు లొనరించు కార్యములు, పలోన్నతము లైన గాని, పామరులు గ్రహింప నేరరు. నిలకడమీాద గాని, నిజము తేలదుగదా! గుండుదెబ్బ తగిలినవానివలెనే భూమిపై గూలెను. ఆత డిట్లు ఒరుగుటలో అర్థము లేకుండునా! అర్థములేని వ్యర్థపుపని ప్రజ లచే సంస్తవ మొనరింపదు. అపరాధపరిశోధకశిరోమణి జేయునా! అట్టివానిహృదయశోధన గావించుట దుర్ఘటమే. చోరనాయకుడు మత్తు మందు జూపినకతమున శ్యామలరావు బాహ్యప్రపంచమును మరచి గాఢసుషుప్తిని జెందెను. ఆతడు విచిత్రబిలమున బంధింపబడుట యెరుగ డు. ఇప్పు డాతడు కన్నులను దెరచెను. ఆతడెందుండెనో గ్రహించెను. సర్వము అయోమయముగ నుండెను. అంతయు అంధకారబంధురము. దానికితోడు దుర్వాసన అద్దానికి సహకారిగా జానెడుఎత్తున చిన్నచిన్న రాళ్ళలో గూడినచెత్త అంతయు చీమలు-ఎలుకలుగలిగి నానాభీభత్స ముగా నుండెను. ఈ ప్రత్యక్షనరకములోనికి గాలివచ్చుటకు కాబోలు పై భాగమున చిన్న రంధ్రము కలదు. దానికి రెండు చిన్న చిన్న కర్ర ముక్కలమర్పబడి యుండుటచే, గవాక్షమని తెలుసుకొన వలసియు న్నది. శ్యామలరావు గది యంతయు పరికించెను. ఆతని కేమియు పాలుపోవ కుండెను. ఆత డట్లె విచారించుచుండ దృష్టి కిటికీపై బడెను. తోడనే యాత డాగవాక్షముపై కెగబ్రాకి, క్రిందకు జూచెను. అంధకారమే కాని,

యాతడు దీనిమూలమున క్రిందభాగమంతయు కటికచీకటియని గ్రహింపగలిగెనో, అట్టి కిటికీ యొకటి మాత్రము పొడగట్టెను. తోడనే యాతడది గూడ చీకటికొట్టుగా గుర్తించెను. అందెవ్వరును శ్యామలరావునకు కనబడలేదు. నిక్కముగ నందెవ్వరును లేరో, చీకటికతమున కానరాకుండెనో మనమూహింపజాలము కాని యాతడు తన చొక్కాజేబులో జేయిపెట్టి విద్యుచ్ఛక్తి దీపికను దీసి దానిమీటు నొక్కెను. గాఢాంధకార మంతయు, పున్నమరేయి యయ్యెను. ఆవెలుగుమూలమున తన చూపులు చొరినంతమేర, నాగదిని పరికించెను. తనగది యెట్లుండెనో అదియు నట్లే కనబడెను గాని, మనిషియున్న జాడ తెలియలేదు. శ్యామలరావు అందెవ్వరును లేరనియే భావించుచుండెను. గాని అంతరాత్మ అన్యథా ప్రబోధించుచుండెను. ఆతడు మెల్లన కుత్తుక సవరించుకొనుచు "ఈగదిలో నెవ్వరు?" అని బలికెను. అందులకు సమాధానమేమియు లేదు. శ్యామలరావు సంతృప్తిజెందక "ఇందెవ్వరును లేరా!" అని మరల బలికెను. ప్రత్యుత్తరము రాలేదు. శ్యామలరావు కొంతతడవు మౌనము వహించియుండెను. కాని ఆతని యనుమానము స్థిరపడలేదు. తోడనే యాతడు 'ఇందున్న వ్యక్తీ! నేనును నీయట్టి మందభాగ్యుడనే. దయయుంచి ప్రత్యుత్తర మొసంగుము-' అని బలికెను. కొంత తడవు వెనుకటివలె నిశ్శబ్దముగా నుండెను. కాని కొంతసేపటికి 'అయ్యా- ఎవ్వరు' అనుపలుకులు వెలువడెను. శ్యామలరాయుని మోము వికసించెను. ఆతడు శిరఃకంపముతో తనయూహ రిత్తపోలేదని సంతసించెను. తోడనే 'దయయుంచి మీగదిమధ్యకు రండు—' అని బలికెను. శ్యామలరావు పలుకులు ప్రక్కగదిలోయున్న బంధితునకు పడగొట్టినవానికి వేడిగంజి బోసినట్లయ్యెను. ఆతడు మెల్లనప్రాకి తన గదిమధ్యస్థము జేరి కిటికీపైజూచెను. గవాక్షమునుండి తొంగిజూచు శ్యామలరాయు డాతని దృక్పథమున బడెను. పాపము శ్యామలరాయుని గాంచగనే ఆమందభాగ్యు

నకు పంచప్రాణములు జేరెను. శ్యామలరావు గనచేనున్న విద్యుచ్ఛక్తి దీపిక సహాయమున వానిని ఆపాదమస్తకము పరికించి, దీపము నార్పి వైచెను.

శ్యా—అయ్యా! మీ దేయూరు ?

వ్య—బాబూ! ఏ యూరని జెప్పను—నా యవస్థయేమని తెలుపను ?

శ్యా—నాయనా! కష్టములు కాపురము సేయునా! కష్టకాలమునసే గదా! ధైర్యముండవలసినది. నీకు వచ్చిన భయము లేదు. జెప్పుము.

వ్య—తండ్రీ! నీ వెవ్వరవు ? ఇంతవరకు చల్లనిమాట మెరుంగను.

శ్యా—నేను నీవలెనే బంధితుడను. మీ కాపుర మేయూరు ?

వ్య—ఈయూరే !

శ్యా—మీ పేరు ?

వ్య—గోపీనాధుడు.

శ్యా—నాయనా! రామనాధు తమ్ముడవా ?

గో—చిత్తము. మాయన్న పేరు మీ కెట్లు తెలియును ?

శ్యా—పిచ్చివాడా! నాకొక్కనికే తెలియుటేమి ? ఈమధ్య జరిగిన గాధ ప్రపంచమంతయు ప్రచురమయ్యెను. పాపపుణ్యముల మాట నేనెరుంగనుగాని పోలీసువారు మీ యన్నను బట్టుకొని రట గదా !

గో—మా యన్న నే! శ్రీహరి! ఏపాపము నెరుంగని మాయన్న నే! ఔరా! ఇంటిలోని ద్రవ్యము వెచ్చించి మేడకొనుట యేమి ! తమ్ముడు వంచింపబడి హంతకులచే జిక్కుట యేమి ! అతనిని రక్షకభటులు బంధించుటేమి ! కటకటా! న్యాయవిచక్షణ సంపూర్ణముగ నమ

సిపోయెనా ! అమాయకు లీఆర్యావ ర్తమున వసించు భాగ్యము తీరెకా బోలు. న్యాయవిమర్శనజేసి అపరాధుల గనిపెనంగి ఆర్తరక్షణజేయు ప్రభువులు లేరా! అయ్యో, ఎంత ఘోరము! ఎంత న్యాయము! ఔరా! హంతకుడా నీదార్జన్యమడంచి నీవాకొబకు ప్రజలను రక్షించు రాజకీయోద్యోగులు లేరా ! దేశముగొడ్డుబోయి నదా !

శ్యా—జరిగినహత్యలు మీాయన్న నలహామీాద యని రక్షకభటాధికార్లు శంకించిరి. నిలకడమీాద నిజము తేలును గదా !

ఔరా ! అపరాధిని బట్టుకొనలేక నేరస్థాపనంతయు మాాయన్న నెత్తిపై వేచి తమకు పై యధికారులనుండి మాటరాకుండ జేసికొను ఉద్యోగీయులు ఉండిననేమి యూడిననేమి ! న్యాయవిమర్శన చేయజాలని ఉద్యోగీయులెందుకు ? ప్రజల సొత్తుదిని ప్రజల నెత్తిగొట్టుటకా. ఇంతకు మామరదృష్ట మట్లున్నది. ఈ హంతకచక్రవర్తిని బట్టగల సామర్థ్యము ఒక్కమాత్రపువానికి కలుగునా ! వీని మేధాశక్తి అనిర్వచనీయము-సాహసము-అనివార్యము-దుండగములు- హృదయభేద్యములు! ప్రజాసౌఖ్యసంధానకర్తయగు శ్యామలరావును బోలు మహానుభావుడు ప్రజల పూర్వపుణ్యవిశేషమున ఈ సీమను అవతరించి, ఈ పెనుభూతమును రూపు మాపవలయుగాని తదితరులవలన కానేరదు. ఆ పురుష శ్రేష్ఠుడు హంతకులకు మృత్యుదేవత అత డేసేమయుకలడో ! రాజమహేంద్రవరమున దొంగరా జుని తన సహజచాకచక్యమున బట్టుకొని యమపురికంపి ప్రజలయును గు జల్లార్చెను. ఆయన బెజవాడ వచ్చెనని వింటిమి ! వచ్చెనో లేదో !

శ్యా—నేనును అట్లే వింటి.

గో—నీకును అనుమానమే ?

శ్యా—అనుమానము లేదు కాని మనముప్రత్యక్షముగజూచితిమా ?

గో—అట్లయిన మనము బ్రతికి బట్టకట్టితిమన్న మాటయే. ఆతడు వచ్చుటయే యదార్థమయ్యెనేని యీ పెరుభూతమునకు కాలుా సమీా పించిన దన్నమాటయే, బాబూ! మీరెవ్వరు? మీరెట్లు నీనిచే జిక్కితిరి?

శ్యా—నేనును నీవలెనే వంచింపబడితిని. అయితే మనము బయటపడు సాధనమేమియు లేదా!

గో—అయ్యో! మనము బయటపడుట స్వప్నవృత్తాంతము.

శ్యా—అవును గాని తస్కరులు వచ్చులోపల, మనము బయటకు దాటుటకు ఉపాయమేమియు లేదందువా? వీరందరు ఎక్కడికి బోయిరో?

గో—నగరులో కన్నములు వేయుటకు, మనబోటి మందభాగ్యు లు దొరకిన కట్టుకొనుటకు. బాబూ! వీరి రహస్యసంభాషణ మన కేమియు తెలియదు.

శ్యా—అయితే హంతకచక్రవర్తి గ్రామములో కలడా?

గో—నిన్న సాయంకాలమునుండియు ఆతనికంఠము వినుపించుట లేదు.

శ్యా—సరి నీవట్లే యుండుము. మనము బయటబడ ప్రయత్న ము చేయవలయును. ఏకారణముచేతనోగాని మనలను చంపక ఇత వరకును, నిర్లక్ష్యము జేసినారు. ఇక మనము కాలయాపన జేయరాదు అనిపలికి, క్రిందకు దిగెను. శ్యామలరావు మెల్లన తనగది నలుగడల పరీక్షించుచు "నేనూహించినవన్నియు యదార్థము లయ్యెను. ఈ దొంగ లెల్ల నేడు రామనాథునింట కన్నము వేయుటనిశ్చయము. రాజమహేం ద్రవరముపోయి యుండవలయు. గౌరీపతిరావు కూతురు రాజమహేంద్ర వరమున నుండుట స్పష్టము. ఈమారువహంతకుడు దొంగరాజుని యన్నచునుట నిర్వివాదము. ఈతడు దొంగరాజునని జట్టుకునకాడ నా యకత్వము వహించుచుండెననుట నిర్ధరము. ఇక మీాద కార్యక్రమము

నిర్ధారణజేయువలయు సరి, ముందు గోపీనాథునితో నేనిక్కడనుండి దాట వలయు. పాపము, ఈ దోషాచరుడు తన్ను మీరిన మాయలమారియు, వంచకుడును లేడని విర్రవీగుచుండెగా ! నేను గుండుదెబ్బ తినియే భూమిపై గూలితినని యూహించెను. గాని తన రహస్యమందిరమును తన చిరకాలవాసమగు పాతాళగృహమును కనుగొని, పుత్రమిత్రకళత్రాదులతో తన్ను రూపుమాపుటకని గ్రహింపనేరడయ్యె. కానిమ్మ, శ్యామలరాయుని పటుత్వమును నింకను పరికింపగలడు." అని యాతడు తన మందిరమంతయు కలయదిరుగుచుండెను. అతడు చీటికి మాటికి పెదవిగరచుచు పైకి జూచుచుండెను. ప్రక్కల కనుగొనుచుండెను. భూమిని పరిశీలించుచుండెను. పాపము ఆతనికి తెరవు యెక్కడను కాన్పింపదయ్యె రాతిగోడలమధ్య జిక్కిన యాతడు బయటబడుట సాధ్యమా! శ్యామలరావును కేమియు పాలుపోవకుండెను. అతడు తనగదిలోని చెత్తనంతయు కాలితో ప్రోవుజేయుచు ఒకమూలకు జేర్చుచుండెను. అతడు గదిసలు గడలయున్న చెత్తనంతయు, ఒకదరి జేర్చుచుండ, ఈశాన్యమూల, అతని కాలున కేద్దియో గట్టిగాసోకెను తోడనే, యాతడు తన కాలుతో తడిమి జూచి శిరఃకంపముతో దిమ్మయని దెలుసుకొనెను. అతడు తన చొక్కాజేబులో చేయిపెట్టి విద్యుచ్ఛక్తిదీపికనుదీసి దానిమీటునొక్క అద్దాని వెలుతురునమూలమున తన యభిప్రాయమును స్థిరబరచుకొనెను.

శ్యామలరాయుని హృదయ మేలకోగాని తీవ్రముగ గొట్టుకొనసాగెను. అత డాదిమ్మను కాలితో దన్నెను గాని గట్టిగానుండు టెఱింగెను దాల నెట్లయిన త్రవ్వనెంచెనుగాని, సాధన సామగ్రిలేదని యోచింపుచుండెను. అతనిదృష్టి గవాక్షముపై బడెను. తోడనే యాత డాకిటికీపై కెగబ్రాకి దానికమర్చబడియున్న టేకు కర్రముక్కలను శక్తికొలది గుంజివైచెను. కొలదిసేపటికా కర్రలువిరిగిపోవ వాటిని దీసుకొని క్రిందకుదిగెను. పాపము, ఆకర్రముక్కల సహాయమున దిమ్మను త్రవ్వనెం

చెను. వాటిమూలమున గట్టిభూమిని త్రవ్వఁగునా! ఆతఁడట్లే త్రవ్వుచుం డెను. మెల్లమెల్లన పైపరున మన్ను నంతయు త్రవ్వుచుండెను. ఆతఁడిట్లు ఒక్క అడుగులోతు త్రవ్వసరికి 'టక్కు'మను శబ్దము వినబడెను. మన్ను నంతయు నొత్తిగించి విద్యుచ్ఛక్తిదీపికను ముట్టించి యాఘనపదార్థమును పరిశీలించెను. అది యొకనల్లరాయి యని గ్రహించెను. ఆశిల మూఁడుచ తురపు అడుగులు పొడవు గలిగియుండెను. శ్యామలరాయుని హృద యము ముందుకు పరువెత్తుచుండెను ఆతఁడు రాత్రిపక్కనే కొలఁదిగ కన్న ము జేసి లోనికి చేతులను బోనిచ్చి ఆరాయిని పెల్లగింప ప్రయత్నించుచుం డెను. అకిటికి శిలాకృతిగనే యుండెనుగాని కదలుటలేదు. ఫత్తేదారుఁడు తనపట్టును విడువక శక్తికొలఁది పైకెత్తజూచుచుండెను. కాని కార్యసాఫ ల్యము గానుపించుటలేదు. అతని శరీరమంతయు స్వేదజలపరిపూర్ణము య్యెను. కరచరణములు లాగుకొని పోవుచుండెను. ఆయాస మధికమగు చుండ ప్రాణములు సొమ్మసిల్లుచుండెను. కాని యాతఁడు తనచేతులను బయటకు దీయకట్లే పెనఁగులాడుచుండెను. ఆహా! చదువరులారా! శ్యామలరాయుని కార్యదీక్ష యెంతయు ప్రశంసనీయముగదా! ఆతఁడట్లె కొంతడవు సేదదీర్చుకొనుచు క్రమ్మర తనకార్యము రెట్టించుచుండెను. అహాహా పురుషప్రయత్నమున కార్యములు చక్కఁబడకున్న గత్యంత రమేముండును! తనశక్తికొలందిని బాహువులతో నా శిలను పెరికివై చెను.

చదువరులారా! ఆ రాయిక్రింద యేమికలదు? ఫత్తేదారు డే యూహతో నింతశ్రమబడి దానిని పెల్లగించెను? ఆతనిమేధాశక్తి సామా న్యమా! శ్యామలరాయు విద్యుచ్ఛక్తిదీపికను ముట్టించి తాను పెల్లగించిన రాయిక్రింద యేమిగలదో పరిశీలించెను. ఆతనిమోము పున్నమచంద్రుని వోలె కలకలలాడజొచ్చెను. అంతసంతసమునకు కారణమేముండును? సారంగమును ప్రత్యక్షముగా గాంచుచుండ ఆనందముగాక మరేమి!

అతఁడాసారంగమున తలదూర్చి చేతనున్న దీపముచే లోనికిఁజూచెను. అయ్యది నిడివిగానుండుట గుర్తెరింగెను. ఆబిలమున ప్రవేశించుట పరమ ప్రమాదంబనియాతఁ డూహించుచుండెనుగాని ప్రకృతమున మృత్యుదంష్ట్రిలనుండి దాటుసాధనమేమియు లేకుండుటచే కర్తవ్య మదియేయని యాతని యంతరాత్మ ప్రబోధించుచుండెను. గోపీనాథునితో నాబిలమును చొరుటయే శ్రేయోదాయకమని నిశ్చయించుకొనెను. గోపీనాథుని యాబిలమువద్దకు తీసుకొని వచ్చుటెట్లు? శ్యామలరావు తనతల నాసారంగమునుండి దీసి, కిటికీ సమీపమున చేరుచుండెను. అతఁడాకిటికీ రంధ్రమునుండి తలదూర్చెను. గాని మిగిలిన దేహము పట్టదనుట స్పష్టమయ్యెను. గోపీనాథుఁడు తనకన్న సన్నమైనను, ఆకిటికీనుండి దూరుటసంభవమని యూహించి దానిని కొంత వెడల్పుచేయవలయునని క్రిందకు దిగెను.

కాలమంతయు యోచించుటలోనే దొర్లిపోవుచుండెను. రాత్రి సుమారు రెండు యామములు కావచ్చెను. చేయవలసినదానియందు సగముపాలైన చేసియుండలేదు. కన్నమునకై బోయిన హంతకులు వచ్చుసమయము కావచ్చెను. చోరనాయకుఁడు కూడా నెందుండియో యాడివడ దబ్బున యీతలంపులన్నియు శ్యామలరాయుని హృదయ వేగమున హెచ్చింపుచుండెను. ఆతఁ డొకనిమిషము యోచించి తాను పెల్లగిల్చిన నల్లరాయిని లేవనెత్తి తనశక్తి కొలదిని యా కిటికీ ప్రక్కనే గొట్టనారంభించెను. ఆతఁడట్లు కొంతతడవు గొట్టునంతకు సుమారు ఒక అడుగుముక్క గోడనుండి యూడి క్రిందబడెను. ఆతఁడట్లు మరల గొట్టనారంభించెను. మరొక్క అడుగుముక్క క్రిందజారిపడెను. తోడనే యాతఁ డాశిలను క్రిందకు ద్రోసివైచి "గోపీనాథా! నీవీ కన్నమునుండి నాగదిలోనికి రావలయును. ఇక్కడనుండి వెలుపలికిఁబోవు నుపాయము కలను. నీవు త్వరపడవలయును కార్యము పరమప్రమాదమైనది' అనిబలికెను.

గో—అయ్యా! ఈ విషమపరిస్థితులలో సహాయము చేయుచున్న నీవెవ్వరవో నే నెరుగను నాకు ప్రాణదానమొసంగు చుంటివి.

శ్యా—దానికేమిగాని-కాలయాపన చేయరాదు. వేగిరపడవలయు హంతకులు వచ్చుసమయము కావచ్చెను.

గో—అయ్యా! ఈ కిటికీ యెక్కు టెట్లు?

శ్యా—మెల్లగ గోడమీద కాలువైచి యెక్కవలయు. నేనిక్కడనుండి చేయూత నొసంగెదను.

గో—చిత్తము.

గోపీనాధుడు గోడబట్టుకొని పైకెక్కు చుండెను. శ్యామలరావు తన దక్షిణహస్తము నందించెను. ఆతడా చేయి బట్టుకొని పయికెక్కెను. శ్యామలరావు క్రిందకు దిగెను. గోపీనాధుడు, మెల్లగ కన్నములో తలదూర్చి బయటకు వచ్చుచుండ క్రిందనుండి శ్యామలరావు తన బాహుద్వయమునుసాచి గోపీనాధుని క్రిందకు దింపెను. వారిరువురు సొరంగమును జేరుచుండిరి శ్యామలరావు, చేనున్నవిద్యుచ్ఛక్తి దీపికను ముట్టించి, సొరంగములోనికి దిగుచుండెను. గోపీనాధుడు, ఆతనిని యనుసరించుచుండెను. వారిరువురును, నా బిలములోనికిదిగి, సొరంగద్వారమును, నొకటిరాయితో గప్పివేసిరి. సొరంగమునిడివి యెంతగలదో మనకు తెలియదు కాని, యెత్తుమాత్రము, మూడడుగులకంటె హెచ్చులేదు. కావుననే, శ్యామలరావును, గోపీనాధుడును ప్రాకియె బోవుచుండిరి. శ్యామలరావు మార్గదర్శకుడై మున్ముందు బోవుచుండ, గోపీనాధుడు వానినివెన్నంటు ఈ సొరంగము ఎక్కడికిబోవునో, వత్తేనారుచకును తెలియదు. పాపము! వారుపోవుమార్గమునకు అంతు కానబడుట లేదు.

రాత్రి సుమారు రెండుగంటలు కావచ్చును. వివిధతావులకు తమ తమ పనులపై బోయినతస్కరులెల్ల గుహాభిముఖు లగుచుండిరి.

వారెల్లదొంగిలి తెచ్చిన వస్తుసముదాయములనెల్ల తమయేలిక గదియందు భద్రపరచి హెచ్చుతగ్గులను పరిశీలించుకొనుచుండిరి.

పాతాళగృహసంరక్షణకై నియోగింపబడిన భైరవుడుగూడ నారేయి కన్నమునకు బోయెను. ఆహారనిద్రాదులు లేకున్నను భైరవుడు భరింపగలడుగాని దొంగతనములేకున్న మనజాలడు. రహస్యమందిరమున రాతికొట్లలో బంధింపబడిన వారేమగుదు రనితలంచెను. గాని యింతటి విప్లవము జేకూరునని యాతడెరుంగడు. అతడు తనపనిపై బోయినను దృష్టియాతయు బంధితులమీదనే యుండెను. కావుననే వారు బంధింపబడిన మందిరములను వీక్షింప బిరబిర బోవుచుండెను.

భైరవుడు గోపీనాధుని, గదితాళమునుదీసి లోనం బ్రవేశించెను. అతడు తనచేతియందలిదీపిక సహాయమువలన నాగదియందు గోపీనాధుడు లేడని తెలుసుకొనెను. అతడు నిలువున గూలబడెను. హృదయవేగము మితిమీరుచుండ గదినలుగడల పరికించెను. కిటికీ పైభాగమంతయు బ్రద్దల కొట్టబడియుండుట నాతడు గాంచెను. అతడు ఆందోళ-తో, అ-ర-రే మో-స-ము మోసము అని బిగ్గరగానరచి శ్యామలరావు బంధింపబడినగది జేరెను. భైరవుని యాక్రందన తదితర తస్కరులజెవింబడ వారెల్ల నాతని జుట్టుముట్టిరి. ఎల్లరును భయభ్రాంతులై వణకుచుండిరి. భైరవునకు మనోచాంచల్యము గల్గెను అతడు తనమిత్రులనుజూచి "కొంపమునిగి పోయింది. నా బ్రతుకు భగ్నమైనది." అనిబలికి, శ్యామలరావు పిల్లగించి తాను దాటిపోవునపుడు మరలవైచినరాయిని భైరవుడు చేతులతో దీసివైచెను. సారంగమెల్లరకు స్పష్టముగ కనబడుచుండెను. భైరవుడు తనచుట్టునుంగల తన బలగమును జూచి, 'పేరా! పేరా! మీరిద్దరును నాతో రండు. మిగిలినవారు ఈ బిలద్వారమును మూసివేసి ఇందే యుండుడు. దొరవచ్చునవుయము కావచ్చెను. మన భాగ్యమెట్లున్నదో; అనిబలికి చివాలున నా సారంగములోనికి దిగెను.

వారు ముగ్గురును విసవిస ప్రాకిబోవుచు జెవియొగ్గి నాలకించు చుండిరి. మధ్యమధ్య గుసగుసలాడుచుండిరి.

శ్యామలరావును గోపీనాథుడును సుమారు నాలుగయిదుఫర్లాంగులు ప్రాకిపోయియుందురు. భైరవుడును మిత్రులును పగబట్టిన తాచుపోలె అతిరయమున ప్రాకిబోవుచుండిరి. ముందరగుచున్న శ్యామలరాయునికట్టివల్లార్చ నెంచుచుండిరేగాని శరీరములనుండి రక్తధారలు ప్రవహించుచున్నను సరకుగొనుటలేదు. పాపము! వారి కాయాసమధికమగు చుండుటచే శ్వాసలధికముగ వచ్చుచుండెను. ఆసమయమున మున్ముందరగుచున్న శ్యామలరాయుని వీనుల కెద్దియో అలుకుడు వినవచ్చెను. తమ్మెవ్వరో వెన్నుదన్నుచుండిరని గ్రహించుకొనెను. ఇకను ఎంతదూరము పోవలయునో తెలియకుండెను. విద్యుచ్ఛక్తిదీపికయందలి సరుకు తరిగిపోవుచుండుటచే మధ్యమధ్య ఆర్పివేయుచు మరల ముట్టించుచుండెను. మార్గమంతయు శిలాసమ్మేళన మగుటచే ప్రాకిబోవుట బహుదుస్తరముగా నుండెను. ఆ మార్గమునకలవడిన తస్కరులు శరవేగమున తమ్ము కలుసుకొనుచుండిరి. అతని కేమియు పాలుపోవకుండెను. తాను కాలసర్పములచేజిక్కుకొనెనని తెలుసుకొనెను. తోడనే యాతడు సొరంగము మొదమప్రక్కకు జేరి గోపీనాథుని, తన వెనువెంటనే, రమ్మని, ప్రక్కనుండియే, బోవుచు వెనుకవైపు జెవియొగ్గి యాలకించుచుండెను. అతడు తనయునికి పరమప్రమాదముగ మారుచుండెనని మోదించి రివాల్వరుదీసి 'ఢాం' అని యొకగుండును పేల్చెను. 'ఢాం' అనుశబ్దము ఇక్కడ బయల్వెడలగనే తస్కరులనుండి 'ఢాం, అనుశబ్దము వినబడె, గుండు, మెరుపువంటి మించుతో ప్రక్కనుండియే దూసుకొనిపోయెను. గోపీనాథుడు, శ్యామలరావు, చెప్పినచొప్పున బిలముప్రక్కనే యున్నను ఆత్రుతతో, వంగి, వంగి, చూచుచుండుటచే, అతని యడమపార్శ్వము నుండి గుండు దూసుకొనిపోయెను. గోపీనాథుడు "అమ్మా!" అని

యరచి భూమిపై గూలెను. శ్యామలరావునకుసర్వము అయోమయ మయ్యెను. ఆతడెందుండెనో యెఱుంగడు. కర్తవ్యము తోపదు. అంతయు అంధకారమే! శ్యామలరావు పేల్చిన రివాల్వరుగుండు భైరవునివక్షము నకు దగిలెను. భైరవుడు భూమిపై గూలిపోయెను. తన నాయకుడు పుడమిపై గూలిపోవుట, వీరడుజూచి కోపోద్దీపితమానసుండయి భైర వుని హస్తమునున్న రివాల్వరునుదీసుకొని, గుండువచ్చిన మార్గము వైపు గుఱిపెట్టి, కాల్ప నుద్యమించుచుండెను.

ఆసమయమున 'ఢాం' అను భీకరస్వనమును రివాల్వరుగుండొకటి వీరని తాకెను. తాళవృక్షమువోలె వాడు భూమిపై గూలెను. కొంతతడవు సారంగమునందంతటను నిశ్శబ్దము ప్రబలెను. కాని రెండునిమేషములకే ఢాం, అను శబ్దము బయల్వెడలి గుండొకటి వీరడుమేనుదాకెను. ఆతడు సారంగముబ్రద్దలగునటుల పెద్దపెట్టున యరచి భూమిపై గూలెను. శ్యా మలరావు సారంగముప్రక్కనే యాముకొని యుండి రుధిరముగ్రక్కు చున్న గోపీనాథుని తనయొడిలో జేర్చుకొని యొక్క ముహూర్తకాలము జూచెను. ఆతనికి అలుకు డేమియు వినిపింపలేదు.

తోడనే, గోపీనాథునికంఠమునను న్న ఉత్తరీయమును దీసి, ఆత నికి దెబ్బతగిలిన ప్రదేశమున దానిని జుట్టుబెట్టి, యాతనిని తనయొడిలో బెట్టుకొని, సారంగముప్రక్కనుండియే ప్రాకిపోవుచుండెను.

---

## ఆరవ ప్రకరణము.

---

నిశాకన్య కవసానదశను జగంబుల హెచ్చరించుచుండెనో యను నట్లు కొక్కొరోకోయని కోడికూత వినవచ్చెను. శకుంతసంతానంబుల కిలకిలారవంబుల దిగంతములు ప్రాకిపోవుచుండెను. బాటలయందెల్లడ ల కొలది సవ్వడి వినవచ్చుచుండెను.

ఆసమయమున బెజవాడనుండి యేలూరునకుగల రాజబాటపై మోటా రొకటి బెజవాడ జేరుచుండెను. అందులో నలుగురు యువకులు గూర్చుండియుండిరి. వారిలో నొకయాతడు బలిష్ఠములగు అవయవములుగలిగి గంభీరమగుమోముతో, విశాలమైన జ్యోతులవలె మెర్రనైన నయనద్వయముతో తెమ్మెదరెక్కలవలె నల్లనికోరమీసములు గలిగి, నల్లవస్త్రులను ధరించియుండెను. ఆతడు దక్షిణహస్తమున పిస్తోలునుబట్టి తివిసీమీద వెనుక పరికించుచుండెను.

ఎవ్వరి నామోచ్చారణచే బ్రజలెల్ల ఉచ్ఛ్వాస నిశ్వాసములు బంధింపబడి గజగజవణకుచుందురో; ఏకాంతమునిదలంచి ధనాధికులు ఘోరశార్దూలమునుగాంచు గంగిగోవులవలె కలుగుండు వడుదురో; అట్టి బలేరాముడు యీతడే యనిగ్రహించుకురు గాక!

మోటారు తిన్నగా పాతాళగృహము జేరెను పాతాళగృహము శోభాశూన్యమై వెలవెలబోవు టాతడు, గుర్తెరింగెను. హంతకులెల్ల పూర్వపుకీర్తిని యాతని జేరుటకు వెరగందుచుండిరి అతనికి సర్వము వింతగా గన్పట్టుచుండెను. తోడనే తన పరివారమును జూచి "ఏమిది! మీరెల్లరును ముఖములు వాల్చియుండిరి. వెనుకటిరీతిని కన్నులు పారలేదా! మీవిన్నబాటునకు కారణమేమి?" అనిపలికెను.

దొం—ఏలికా! ఏమనిమనవి చేసికొనము!

నే—ఏమది భైరవుడెక్కడ ?

హంతకులెల్ల మౌనముద్రవహించి శిరములు వంచియుండిరి.

నే—ఏమిరా! బంధితులు సురక్షితమేనా! భైరవు డేమయ్యెను?

దొం—భైరవుడు.

నే—నీళ్ళునమిలెద రేమి ? చెప్పుడు.

దొం—ముప్పు వాటిల్లినది.

నే—భైరవునకే !

దొం—భైరవునకేగాదు-దొరా.

నే—ఇంకను ఎవ్వరకు ?

దొం—ఎల్లరకు.

నే—శత్రులు పారిపోలేదుగదా !

దొంగలెల్ల ఒండొరులమొగములు వీక్షింపుచు, భయభ్రాంతులై నిలువబడి యుండిరి.

ఆతని లోచనద్వయము అరుణీకృతమయ్యెను, శరీరముకొలది తొట్రుపాటుసూచించుచుండ కారాగారములదెస వెసవెస నడచెను. ఆతనికి సర్వము బోధపడెను. ఆతడు నిలువున కూలబడి క్రోధసముద్రమున ఘూర్ణిల్లుచుండెను. ఆతడు "ఔరా కొండపట్టు గలిపితిరి- ఈనగాచి నక్కలపాలొనర్చితిని-భైరవా ! నీవుజచ్చితివి ? ఏమిరా! భైరవుడెక్కడ ? దాపక నిజముపలుకుము మీ ప్రాణములుండవు ? జాగ్రత్త-చెప్పుడు" అనిబల్కెను

దొం—ప్రభూ ! రేత్రి మేమెల్ల కన్నమునకు బోతిమి ?

నే-ఊ—అందువిశేష మేమున్నది ? తరువాత.

దొం—గుహలో బంధింపబడిన వారేమగుదురని-భైరవుడు కూడరాత్రి—

నే—ఔరా ! భైరవా ! నాయాజ్ఞ తిరస్కరించితివా ! చావునకు తెంపరివైతివా ! భైరవుడుకూడ బోయెనా దొంగలెల్ల గజగజ వణంకుచు హస్తములుమోడ్చి జరిగిన వృత్తాంతమంతయు పూసగ్రుచ్చినటుల తమస్వామికి నివేదించిరి. తోడనే యానరాంతకుడు దీర్ఘశ్వాస వదలి ఔరా! భయిరవా ! నీవిపుడమిపై లేవు. చచ్చితివి. నాయాజ్ఞోల్లంఘన చేయుటకు నీగుండె తాళెరా ! వచ్చినెత్తురుత్రావు నాక్రూరత్వమును మరచితివా ! యాదవకులమునకు ముసలము బుట్టినది. పట్టపవలే చంద్రోదయమా ! దొంగలనాయకుని రహస్యమందిరమే బయ

టవడుటయా ! మాయా మయుడనగు నేనే మోసగింపబడుటయే;
ఔరా ! శ్యామలరాయా ! నా సమాజసత్యమును శోధింపనుంకింతు
వా ! బ్రిటీషురాజ్యసర్వస్వము నిన్ను వెన్నుదన్నుచున్నను, నాకు
నీవు తృణప్రాయుడవుసుమా ! నా హృద్రహస్యమును దొంగిలించి నీవు
బ్రతికెదవా ! కానిమ్ము మృత్యుదంష్ట్రల జిక్కినను వెలువెడల వచ్చు
గాని నాదృష్టినుండి తప్పుట నీతరముగునా ! నీవేడినెత్తురు త్రావి, నీ
ప్రేవులను ధరింపకున్న నాసంతప్తమానసము శాంతింపనేరదు' అని
యాతడు శ్యామలరాయు పారిపోయిన సొరంగములోనికి జొచ్చెను. ఆత
డు విద్యుచ్ఛక్తి దీపికను ముట్టించి, బిలముగుండా కొంతదూర మరుగు
సరికి గుండుదెబ్బ తగిలి రక్తము గ్రక్కుకొని తాళవృక్షమువలె జచ్చి
పడియున్న భయిరవు డాతనికి పొడకట్టెను. హృదయము చలించెను.
క్రోధశోకరసముల తన్నుదాను మరచెను. ఆతడట్లె కొంతదవ్వరగుసరికి
భయిరవుని యనుచరుడు వీరడు భూమిపై బడిపోయియుండుటగాంచెను.
రక్తనాళములు తీవ్రోష్టతనుజెందెను. ఆతడు శిరఃకంపముతో ముందున
కింకను బోవుచుండెను. మరికొంతదూర మరుగుసరికి చావమట్టుగ
పేరడు దారికడ్డముగ జచ్చి పడియుండుటను గాంచెను. ఆతడు తనవారి
పాటుజూచి 'ఔరా ! శ్యామలిరాయా ! నావారిని ముప్వురిని జంపితి
విగా ! నీతో మావారిని మూకుమందలముండిని జంపినగాని నీడు కన్ను
మూయడు. నీవెందుబోగలవు' అని యాతడింకను ముందుకు బోవుచుం
డెను. ఆతడట్లె యొకఫర్లాంగు దూరమరుగుసరికి భూమిపై రక్తముస్రవిం
చుచుండుట నాతడుకనుగొనెను. గౌరీనాథునకో శ్యామలరాయునకో
గుండుదెబ్బ తగిలియుండునని యాతడూహించి తన ప్రయాణమును
కొట్టించుచుండెను. అతడెంతదూర మరగినను పరిసంధిజాడ తెలియులేదు.
వారా బిలమును దాటియుందురని నిశ్చయించి యొక నిమిషమెద్ది యో
యోచించి గిరుక్కున వెనుకకుమరలెను. ఆతడు గుహాభిముఖుడై అతి

రయమున బోవుచు పేరడు చెంతనేయున్న పిస్తోలును దీసుకొని తననెలవు జేరెను. హంతకులెల్ల తమనాయకుని జుట్టును జేరిరి. ఆతడు వారినెల్లగాంచి 'జరుగదలచిన దంతయు జరిగినది. ప్రమాదము-పరమప్రమాదము-మన రహస్యకృత్యములనెల్ల వెలితిజేయక యింతదనుక మనలనెల్ల తనకడుపులోబెట్టుకొనిన పాతాళగృహము మనకు శతృస్థానము-మనవారితో కలకలలాడుచుండిన మాతృమందిరము మృత్యుగహ్వరము. పుష్పమాలికా కోదరమయ్యెను. పాలు విషద్రావకమయ్యెను. కన్నతల్లి కటికశత్రువయ్యెను. రంగా! త్వరపడవలయు మనము' అని యాతని చెవిలో నేమియో జెప్పెను.

రం—నిజమంతియే. ఆలస్యము చేయరాదు.

నే—వెలుగురాకుండగనే దాటవలయు. నా గదిలోనికి బోయి సర్వము సిద్ధముచేసెదను. మీరనులపై మీరుండుడు.

దో—చిత్తము.

ఆతడొందులకో తన మందిరములోనికి బోయెను. తస్కరులెల్ల పాతాళగృహమువీడ నుద్యుక్తులయి యుండిరి.

చదువరులారా! మనమిప్పుడు శ్యామలరావు గోపీనాథుల సంగతికొంత కనుగొనవలసి యున్నది. గోపీనాథునకు గుండుదెబ్బ తగులుటయు, ఆతనిని తనహస్తద్వయమున నిముడ్చుకొని సొరంగముగుండా మెల్లనప్రాకి బోవుటయు మన మెరుంగుదుము. శ్యామలరావు గోపీనాథుని తనయొడిలో బెట్టుకొని సొరంగము నతిక్రమించి బోవుట కెంతశ్రమబడి యుండునో మాచదువరు లూహింపవలయుగాని మాకు వర్ణనాతీతము.

శ్యామలరావు గోపీనాథునితో తనగృహము జేరుసరికి తూర్పుతెల్లవారుచుండెను. గోపీనాథుని యొకమంచముపై పరుండబెట్టి యాతనికి తాత్కాలికపుచికిత్సజేసి పడకకుర్చీపై పరుండబెట్టెను.

ఆతడు కడుబడలిన హేతువుచే కాబోలును నిద్రపట్టజాలక కుర్చీ పై పరుండి కన్నులు మూసెను.

ఉదయము యెనిమిది గంటలు కావచ్చెను. బెజవాడ పెద్ద పోలీసుస్టేషనులో ముగ్గురు వర్తేదారులు కూర్చుండి యీక్రిందివిధమున ప్రసంగించుకొనుచుండిరి.

స-యి-ఏమండీ ! చిత్రము ! కన్నములేదే !

వ-సుదర్శనరావుగారూ ! ఆరితేరిన చేతులకు కన్న మెందులకు. ఒకగాంగు వచ్చియుండవలయు.

స-యి—నిచ్చినవేసిన జాడయైన లేదండి.

వ—ఎందులకు? బరువుచేటు. పలువురు తన్కులు వచ్చియుండ మీా కాపిచ్చియేమి ?

సు—ఓహో! ఒకరిభుజములపై నొకరుయెక్కి యుండిరనియా?

వ—సందేహమేమి ? తలుపులఘడియ లెంతచిత్రముగా వేసి తిరో గాంచితిరా !

సు—నాగరికత బలసినకొలదిని సర్వము తేలికబడుచున్నదండీ! రాతిగోడ చిత్రముగ దొలిచితిరే.

వ— అదేమిటండీ ! బీగములు బిగించిన ఇనుపపెట్టెలను సునాయాసముగా చప్పుడు లేకుండగా తీయుచుండిరి.

సు—పాపము రామనాధునకు మరొకగొప్ప దెబ్బ !

వ—పోయినసొత్తు సుమారు పాతికివేల రూప్యములుండునన్న మాట యదార్థము.

సు—ఇంటిలో ఒక్కసామాను ముట్టుకోలేదండి.

వ—ఎందులకు? నగలపెట్టెదొరకగా చిల్లరసామాను లెందులకు

సు—ఇంకను చుట్టుప్రక్కల యెన్ని కన్నములుజరిగెనో!

ప—కొంతసేపు తాళిన సర్వము తెలియును. వాళ్ళు కేవలము దొంగలేగారు హంతకులుకూడను. మొన్న జరిగిన విచిత్రపు కూనీకేసు లోనివారేగాని పరాయివారు మాత్రముగారు.

సు—వారెంతమంది యుండియుందురో?

ప—పెద్దసంఖ్య యనుట నిర్వివాదము.

సు—ఇదేమిటండీ! గౌరీపతిరావు కూనీవిషయములో ఆచూకీ దొరకలేదు. పత్తేదారులు కూపమున కూలిపోవుచుండిరి. శ్యామలరావు సంగతి తేలలేదు. కన్నులుమూసి తెరచునప్పటికి సర్వమయామాయమై పోవుచున్నది. గోరుచుట్టుమీద రోకలిపోటన్నట్లు పైన దొంగతనములా! శ్యామలరావు లేడని యీహంతకులు చెలరేగుచున్నారు కాబోలు! ఏమండీ! శ్యామలరావు జీవించియుండెనా!

ప—శ్యామలరావుగారికే గనుక ముప్పువాటిల్లిన భగవంతుడు లేడని గట్టిగాచెప్పనగును. మనపదవులకు రాజీనామాయిచ్చి యిండ్లలో నొడిగి యుండుట యుక్తము.

సు—అపరాధ పరిశోధకుడన్న శ్యామలరావే! అతను మాయలమారులను తలదన్నినవాడె! సాధ్యమయినంతవరకపాయము రాకుండ దాటగలడు. కాని దైవముకూడ తోడ్పడవలయు.

ప—సందేహామేమి?

వారిట్లు ప్రసంగించుచుండగనే రాజబాటనుండి యొకరక్షకభటుడు పరుగుపరుగున విచ్చేసి తన యధికారుల మ్రోల నిలువబడి "అయ్యా! శ్యామలరావుగారు సురక్షితముగా గృహముజేరినారు. నేను కన్నులారగాంచితిని. తమరినెల్లనొక్క పర్యాయము దయచేయమని శెలవిచ్చినారు. జరూరు అనిచెప్పినారు." అని బల్కెను.

తోడనే సుదర్శనరావు పత్తేదారుల మోములు వికసించెను. వారు చివాలున తమ పీఠములపైనుండి లేచి ద్విచక్రశకటములపై శ్యామలరావు గృహముజేర పయనమై పోవుచుండిరి.

వారు శ్యామలరావును గాంచగనే వారి యానందము మట్టు మీరెను. వారు శ్యామలరాయుని హస్తమును బట్టుకొని "శ్యామల రాయా! అపరాధ పరిశోధకశాఖ అధఃపతనమయ్యెనని చింతించుచు న్నాను. ధర్మమే జయమనుసూత్రము కేవలము కల్పితమని యూహించు చున్నాము. రక్షకభటాదికారులపదవి హాస్యాస్పద మగుటయే గాక ప్రజలు ప్రభుత్వ పటుత్వమును పరిహసింతురని సిగ్గిలు చున్నాము.

ఇప్పటికి మాహృదయములు కుదుటబడినవి.

శ్యా—అయ్యా! మన పేరు చెప్పినంతనే తల్లడిల్లువారిని బట్టిన నేమి బట్టకున్న నేమి! అట్టివారు మనకు శ్రమలేకుండగనే బయట పడ గలరు. ఇట్టికుండగీడును ఇట్టి ప్రత్యక్షపిశాచమును ఈ సుప్రసిద్ధ నరాం తకుని బట్టవలయు మనశక్తి సామర్ధ్యములు వెల్లడికావలయు. ఇదివరకు వారినే మెరుగనిపించును గాని వీడు సామాన్యముగ బట్టుబడువాడు కాడు.

వ—అది స్పష్టమే! మీ రెప్పుడు బయట పడితిరో వారప్పుడే చిక్కినన్నమాట! మీరెట్లు బయట పడితిరి?

శ్యా—అదియే చిత్రము; చెప్పెదనునామోటారుసైకి లెక్కడ?

వ—స్టేషనులో కలదు.

వ—మీరు ఇక్కడనుండి వెళ్ళినది మొదలు ఇంతవరకు జరిగిన చర్య పూసగ్రుచ్చినట్లు జెప్పవలయు. మీరులేనితరి యిక్కడ జరిగిన చిత్రములను మేము నుడివెదము.

శ్యా—అయ్యా! నేనిక్కడ లేకున్నను ఇక్కడ జరిగిన చర్య గూడ చెప్పగలను, కాని ముందుకర్తవ్య మూహింపవలయు.

శ్యామలరావు తానుజేసినది గాంచినది అనుభవించినదిసర్వము తన మిత్రులకు తెలియజెప్పెను. తానులేనితరి జరిగిన యుదంతమును

గూడ బుద్ధిసూక్ష్మతచే నూహించి జెప్పివేసెను. రక్షకభటాధికారులు ముగ్వురును కొంతవఱకు మాటాడక ద్రవహించియుండిరి. కాని శ్యామల రావు తన కథను ముగింపగనే వారిమోములు సంతసమును సూచించు చుండెను. వారెల్ల ఒండొరుల మోములు వీక్షింపుచు ది రిడీల్ యీజు సాల్వ్డు కోటలో పాగా పడినది హంతకశిఖామణి ప్రాణములు మన గుప్పిటబడినవి. కత్తేదారుల నెల్ల ఘూర్ణిల్లజేయుచున్న పరిపంథిహత్యల యందద్వితీయుడని పేరుమోసినమాయామయుడు హర్తలలో కెల్ల మేటి మగడనః నేనే విప్రవీగు పరిత్యక్తుపిశాచము తాపులతో మొర్రో—మొర్రో యను విలపించుకాలమువచ్చినది.

శ్యా—ఎట్లు?

వ—విచిత్రబిలమును పుట్టుముట్టుటయే.

శ్యా—ఆహా! వాడు సామాన్యుడనియే యింకను ఊహించు చుంటిరా! నాకంటబడిన విచిత్రబిలమున ఆతడింకను వాసముజేయునా! అట్టయిన లాభము లేదందురా!

శ్యా—షట్త్రిశము-మీకు సంగతిసందర్భములను జెప్పితిని. మీరు జాగరూకతతో నుండుడు-దగ్గరకురండు అని వారిచెవిలో నేమియో జెప్పి "గోపీనాథునకును నాకును తగిన చికిత్సజేయింపుడు మేము జీవిం చువరకును నమ్మకము లేదు." అని బలికెను.

వారు ముగ్వురును చిన్నాలుసలేచి "అయ్యా! అట్లే జేసెదము. పరాత్పరుడుకలడు. మేము ఏమరియుండము-చికిత్సకునితో మిమ్ములను మరల దర్శింతుము" అనిబల్కిరి.

శ్యా—చిత్తము-జాగ్రత్తసుడీ.

రక్షకభటాధికారులు ముగ్వురును శ్యామలరాయునితో నేదియో గూఢముగా సంప్రదించి యాతనియొద్దసెలవు పుచ్చుకొనిపోయిరి.

---

## ఏడవ ప్రకరణము.

చీకటి కన్నును, కన్నును గానరాకుండెను. మిట్టపల్లములు సమమై ప్రమాదజనకముగనుండెను. పౌరులు అంధకారమునకు వెరచియో హంతకులు నగరునందు కావించు అలజడికి భీతిలియో గాని గృహములందె యిమిడియుండిరి. శ్యామలరావుకు గుండుదెబ్బతగిలి, ప్రాణాపాయస్థితియందుండెనని నగరునందంతట నెట్లువ్యాప్తమయ్యెనో తెలియదు గాని, ప్రజలుమాత్రము వివిధరీతుల గుసగుసలాడుచుండిరి. గౌరీపతిరావు కుటుంబమును, అంతమొందించిన హంతకులజాడ దెలియరాకుండుటయు, అపరాధపరిశోధకుడు పిస్తోలుచే కాల్పబడుటయు పైని రామశెట్టియింట సుమారు ఇరువదిరూప్యముల సువర్ణాభరణములు హరింపబడుటయు, గాంచ, బెజవాడంతయు వార్తలపాలై పోవునని చింతించుచుండిరి. అందు లకేకాబోలును ప్రజలెల్ల మైమరచి నిద్రింపక, గుప్పిటప్రాణములు బెట్టుకొని యుండిరి. క్రమక్రమంబుగ తూర్పు తెల్లవారుచుండెను. అవ్యక్తమాధురీగరిమనింపు శకుంతసంతానముల కిలకిలారవములు దిగంతములు ప్రాకిపోవుచుండెను. రాజబాటల యందెల్లయెడల కొలది సవ్వడివిన వచ్చుచుండెను. నగరునందలి ముఖ్యస్థానములయందంతటను, పెద్దపెద్ద యక్షరములగలిగిన కాగితములు అంటింపబడియుండెను. రాజబాటలపై వచ్చుచుపోవు పౌరులు వాటి నీక్రిందివిధమున జదువ నారంభించిరి.

"అత్యద్భుతము! భావవిజృంభణ! తరుణమునకై వీక్షింపుడు. హృదయవిరాజిత ప్రదర్శనము—రాత్రిగాదు పట్టపవలు—చాటుమాటలుగాదుబహిరంగము—కనికట్టుగాదు—హావభావవిజృంభణ—రేట్లుగాదు ఉచితము—బూటకముగాదు నాటకము—సంగీతముగాదు సాహిత్యము—వ్యక్తియుక్తి—రోగమునకు మందు—దెబ్బకు కట్టు—కన్నులకుగంత—చేతికిసంకెల—మనస్సునకు వంత—చివరకుసంత—"

దీనిభావమేమియో బోధపడకుండెను. పలువురు పరిపరివిధముల ప్రసంగించుకొనుచు, నిర్ధారణ జేసుకొనజాలక తమతమపనులకై పోవుచుండిరి. క్రమక్రమముగ సూర్యభగవానుడు నభోమండలమధ్యస్థుడగుచుండెను. ఆసమయమున ప్రధానరాజబాటనుండి, మోటారొకటిఅంగడివీధి జేరుచుండెను. అందు డ్రైవరుగాక, ఒకఆంగ్లస్త్రీయు, ఆంగ్లయువకుడు కూర్చుండి యుండిరి. ఆస్త్రీహస్తమున వార్తాపత్రిక కలదు. మోటారు తిన్నగా అంగడవీధి జేరి 'థామసు బేకను అండు సన్సు గోల్డు అండు డైమండు, ఎంగ్రేవు మెంట్సు; బెజవాడ' అని యొకబల్లపై వ్రాయబడియున్న వర్తకస్థానము జేరెను. థామసుబేకను అను నాతడు పాశ్చాత్యుడుగాడు గాని క్రైస్తవుడు. ఆతనివేషభాషలు పాశ్చాత్యునిమించియేయుండు; కాని శరీరచ్ఛాయమాత్రము నల్లనిశిలాకృతిని మీరియుండును. ఆతని దుకాణమునందు ముగ్గురు నౌకరులు గలరు. అంగడిలో నవరత్నములును, నవరత్నఖచిత సువర్ణాభరణములు, రజితపాత్రలు, స్త్రీసమూహము తాల్పుటకై నవీనపద్ధతికనుగుణ్యముగు, వివిధానేకసువర్ణాభరణములు, ముంజేతిబంగారు గడియారములు, వెండిపిళ్ళువేసిన చేతికర్రలు, బంగారుబొత్తాములు, తాంబూలపేటికలు, వేయేల వివిధరూపములగు బంగారువస్తువులు అద్దముల బీరువాలయందుంపబడి ప్రేక్షకులదృష్టినాకర్షించుచుండును. పలువురు దుకాణము జేరి, అందలివస్తుసముదాయములను నేత్రపర్వముగ దిలకించుచు, ఖరీదులను తెలుసుకొని కొనుటకు శక్తిజాలక చూచి సంతృప్తిజెంది మగుడి పోవుచుందురు.

బేకను తనదుకాణము ముంగిట నిలిచినమోటారును, అందలి విదేశీయులను వీక్షించి బిరబిర ముందుకునడచి అభివాదమొనర్చి లోనికి దయసేయుమనికోరెను. తోడనే, దొరగారు భార్యతో మెల్లగ మోటారునుండి దిగి, బేకను అంగడిలోనికిబోయి, అందొకకుర్చీపై తన యర్ధాంగిని కూర్చుండబెట్టి, తానుబేకనుతో చిత్రవిచిత్రవస్తువులను జూడ ముం

దున కరుగుచుండెను. ఆంగ్లయువతి కుర్చీపై గూర్చుండి వార్తాపత్రికతిరుగవేయుచుండెను. స్త్రీసమూహమునకు సువర్ణాభరణములన్న ఆసక్తి యుండుట జగత్స్వాభావికమేనా? అది హైందవస్త్రీకేనా పాశ్చాత్య స్త్రీలకుగూడా కలదా? మనదేశమందలి యాంగ్లేయాంగనలు కంఠమున గడియారపుగొలుసులును, చేతికి బంగారు గాజులను ధరించుట మనము గాంచుటలేదా! కొందరు హైందవాంగనలకన్న నెక్కుడు సువర్ణాభరణములను దాల్చుచుండిరే! సువర్ణమనిన ఇష్టము లేనివారుందురా? మనదొరగారి భార్యకు సువర్ణమునం దిష్టము లేదనో, లేక సర్వము తన భర్తకే తెలియుననియో; వార్తాపత్రికజదువుటయందలి యాసక్తినో, పత్రికనుమాత్రము తిరుగవేయుచుండెనుగాని వస్తువులవంక జూచుటలేదు. ఆమెదృష్టి యంతయు పత్రికలందే లగ్నమైయుండెను. తన కంటెదుట యేమి జరుగుచుండెనో యెరుంగదు విభుడేమి జేయుచుండెనో చూడజాలదు. బాహ్యప్రపంచమున నేమిజరుగుచుండెనో గుర్తెరుంగదు. బేరరుపలుకునది వినిపించుకొనదు. మౌనముద్రకుతోడు కనురెప్పలు మూతపడవు. ప్రాకృతలీల కన్పట్టదు. మానసికత్వము పొడచూపదు. ఇంద్రియనిగ్రహము వహించియుండనోపునా! అట్లయిన ఐహికభోగములకు విసర్జింపదా! వార్తాపత్రికతో పనియేమి! విభునితో సంబంధమేమి! ప్రపంచకములో నిమిత్తమేమి; అత్యద్భుత ప్రదర్శనము! చిత్రములలోనికెల్ల చిత్రముగ నున్నదే! ఇదినాటకమా లేక బూటకమా! కామినీకైతవనిగ్రహమా! నిక్కముగా థామ్సను అర్ధాంగియేనా! ప్రత్యక్షముగ జూచుచుండ కాదనుటెట్లు?

థామ్సను దుకాణమునందలి వస్తువుల నింకను పరీక్షించుచుండెను. ఆతడు పరీక్షించుచున్నకొలదిని బేరరు క్రొత్తక్రొత్తమాదిరీలు అందిచ్చుచుండెను. థామ్సను మందహాసముతో శిరఃకంపము జేయుచు, దోసిలియందలి యాభరణములను జూచుచుండెను. బేరరు వస్తువుల

దీయుచుండెను. ధామ్సను వలదనక స్వీకరింపుచుండెను. ధామ్సను జేరముచేయుటలేదు. జేకను ఖరీదు చెప్పుటలేదు. సువర్ణాభరణములతో ధామ్సనుహస్తములు నిండిపోవుచుండెను. వాటిని చూచినకొలదినిమనో వాంఛల్యము గలుగుచుండెను. ధామ్సనుబోలు జేరగానినిగాంచగనే, జేకను యుప్పొంగిపోవుచుండెను. ఇరువురకును ఆనందమే—'అయ్యా! కాలాతీతమైనది నేటికింతటితో సరిపెట్టుచున్నాను' అని బల్కెను.

జే—అయ్యా! చూడతగినవన్నియు దిగడినవి—

ధా—నిజమే! చూచినకొలదిని చూడవలయుననియే యున్నది.

జే—మీాబోంట్లు వచ్చినగదా వస్తువులవిలువ బయటపడుట.

ధా—యథార్థమేకాని వెనుకముందులు చూచుకొనవలదా?

జే—తమవంటివారుకూడ వెనుకముందులు చూడవలయునా!

ధా—ఎవరైనను చూడదగినదే!

జే—'రాజుదలంచిన దెబ్బలకు కొదవా;' అన్నటుల మీారుతలంచిన కొరతపడునా!

ధా—ఆ. యుక్తాయుక్తము యోచింపవలదా! మాటలతో తీరునదికాదుగదా!

జే—సరి. సరి. ఆ బీరువాలోనివస్తువులను చూచితిరా! వాటిని మీావారుచూచిన వదలరు. మీావారిబిలుతురా! వీటిని కొన్నిటిని యాపెకడకే తీసుకొని పోవుదమా!

ధా—ఏదియు వలదు.

జే—ఏలనండి?

ధా—సమాధానమురాదు.

జే—కారణము?

ధా—పద్ధతికి వ్యతిరేకమగుటయే.

జే—నాకు బోధపడలేదు.

ధా—ఆపెదృష్టియంతయు వార్తాపత్రికయందలి హంశములపై నున్నది.

ఈసమయమున రసభంగము చేయరాదు. అది మతమునకు వ్యతిరేకము. మేము వారిమనస్సునుబట్టి నడుచుకొనవలెగాని... మీరును తెలిసియే యుందురు నీకింకను స్పష్టీకరింపవలయునా!

బే—మీరుచెప్పినది సత్యమేగాని యాపెప్రోత్సాహముమీద నే మీ రిటకు వచ్చితిరిగావున వలుకరించిన ప్రమాదముండదేమో యని నా యభిప్రాయము.

ధా—కాదు. కాదు. ఆపె నాతో యిదివరలోజెప్పిన వస్తువు లన్నియు దీసితిని. క్రొత్తవాటివిషయములో ఆపె యనుమతి యావశ్యకము కాని వర్తృతమున ఆపెచదువుకు అంతరాయము కలిగించరాదు.

బే—ఈక్రొత్తమాదిరీ నగల నాపెచూచిన నిక్కవముగ కోరి తీరును కావున... ... ... ...

ధా—నిజమే! ఒకపావుగంటలో పత్రికచూచుట ముగియవచ్చును. తరువాతామెయే స్వయముగా వచ్చి వాటిని దీసుకొనును. ఈ లోపున తీసినవాటికి... ...

బే—ఆ. అదిబాగున్నది. మీరింకనుమోచింమనదేమి?

ధా—అబ్బే! ఏమియు—లేదు—గాని...

బే—సెలవియ్యుడు—

ధా—ఇప్పుడు వీటికి ఖరీదులను వేసి జాబితా తయారు చేయుడు.

బే—చిత్తము.

బేకను, ధామ్సను తీసినవస్తువులజాబితాయును ఖరీదులనువేయుచుండెను.

థా—ఈలోపున పత్రికచదువుటయు మఃగియును; ద్రవ్యము కూడ సమకూర్పగలుగుదును.

బే—అయ్యా! ఖరీదులపట్టీ వేసికొనుడు. మొత్తం పదిహేను వేల అయిదువందలు రూప్యములు. వస్తువులను సరిచూచికొనుడు.

జాబితాప్రకారం బేకనుచదువుచుండ, థామ్సు విలియాంవేసుకొనుచుండెను.

థా—అయ్యా! అన్నియు సరిగా యున్నవి. నేనుద్రవ్యముతో కన్నుమూసి తెరచునంతలో వచ్చెదను. నాభార్యచదువుముగింపు కాగలదు.

బే—చి-త్త-ము.

థా—మీకు అంగీకారమే! లేక నాతో మీవారి నెవ్వరినైన బంపెదరా?

బే—సరి. సరి. అవసరములేదు. మీవారిక్కడుండుట చాలదా త్వరలో దయచేయుడు.

థా—అట్లయిన సరియే.

థామ్సను వస్తువులను దీసికొని దుకాణము బయట వేచియున్న తన మోటారునెక్కెను. రాజబాటపై పరువిడుచుండెను.

థామ్సనుమోము నిందుత్సాహమును సూచించుట బేకను గుర్తెరింగెను. ఆతడు పోవుచున్న మోటారువంక తదేకదృష్టితో తృటికాలము చూచి శిరఃకంపమొనర్చి చివాలున లోనికిబోయెను.

ఆతడు లోనికేగి తనసేవకులలో నొక్కనిగాంచి "జాక్! ఇటు రమ్ము" అనిబిలచి యాతని చెవిలోనేమియోజెప్పి జాగ్రత్త. నేనువచ్చువరకు ఆ, ఆంగ్లస్త్రీనేమియు ప్రశ్నింపకుడు దరిజేరకుడు. ఆపైపుచూడకుడు 'అని చెప్పి చివాలున లోనికిబోయెను.'

---

## ఎనిమిదవప్రకరణము.

శ్యామలరావు హంతకులను బట్టుకొనబోయి గుండుదెబ్బతగిలి కొనయూపిరితో పట్టణము జేరెననియు, దొరతనమువారు తమ ఖర్చు మీఁద తగుచికిత్సచేయించి అపరాధపరిశోధనశాఖకు లోటులేకుండ జేయదలంచిరి. గానిదైవము ప్రతికూలుడయ్యెనను వదంతి నగరునందంతటను వ్యాప్తమయ్యెను.

శ్యామలరాయు మరణవృత్తాంతమునకు గుండెయలవయి చేయి వైచుకొని చింతించని పౌరుడు లేడు.

రక్షకభటులును, పురజనులును, వివిధవాయిద్యములతో శ్యామలరాయుని చిత్తరును నగరునందంతటను ద్రిప్పి ప్రతివీధిమొగను, శ్యామలరావొనర్చిన, అద్భుతకార్యములను, ప్రజలకై బడిన శ్రమను, దొరతనమువారియెడల చూపిక్రృతజ్ఞతను ఉపన్యసించుచు పెద్దయుత్సవము జేయగడఁగిరి. ఆతని ప్రతిమను నగరునందంతటను ద్రిప్పి తుదకు, పురమందిర కుడ్యమునకు తగిల్చిరి. శ్యామలరాయుని చరిత్రదేశీయు లెల్ల పఠించుట కనుగుణ్యముగ నుండునటుల వార్తాపత్రికలప్రకటించిరి. రక్షకభటాధికారులును, రక్షకభటులును తమకాదర్శకప్రాయముగ శ్యామలరాయుని పఠమును కార్యస్థానమున నిలుపుకొనిరి. బెజవాడంతయు హంతకులపాలై పోవుననియు, ఏనాడెవ్వరికేమి కీడుమూడునోయనియు వివిధరీతుల గుందుచు, మైమరచి నిద్రించుటకు గూడ పౌరులు భీతిలుచుండిరి.

మాధ్యాహ్నము సుమారు మూడుగంటలు కావచ్చును. ఆ సమయమున బెజవాడనుండి యేలూరుకు గల రాజ బాటపై మోటారొకటి పవనవేగమున బోవుచుండెను. అందు డ్రైవరుగాక మరొక్క ఆంగ్లయువకుడు కూర్చుండియుండెను. ఆపాశ్చాత్యుడుచీటికి మాటికి వెనుకకు

చూచుచుండెను. చదువరులారా! ఈతడెవ్వరు? మోటారునందు గూర్చుండి వెనుక వెనుకలు దీక్షతో శరీక్షింప వలసిన యగత్యము మన ధామ్సనుకుగాక మరెవ్వరి కుండును?

ఆతడట్లే నిదానించుచుండెను. తన మోటారతిరయమున బోవుచుండెను. అనతి దూరమున రాజబాటపై ధూళిరేగుచున్నట్లు పొడగట్టెను. ఆతడట్లే తదేకదృష్టితో గాంచుచుండెను. అతడెద్దియో నిర్ధారణజేసికొని డ్రైవరుతో 'ఒక్క నిమిషము మెల్లగా నడుపుము. మోటారొకటి వచ్చుచున్నట్లున్నది.' అనిబలికెను.

కారు మందగమనము నభినయించుచుండెను. ధామ్సను రెప్పవాల్చక వెనుకవైపు చూచుచుండెను. అతని యనుమానము స్పష్టమయ్యెను. ఆతడెవ్వరై యుండును? ధామసుబేకను గాక మరెవ్వరు కాగలరు! ధామ్సను బసకనుగొని మోటారుపై యాతనిని వెన్నంటుచుండనోపు! పదిహేను వేల అయిదువందల రూప్యముల సువర్ణమును చేతిలోబెట్టి బేకను గగ్గోలుపడక నిమ్మకు నీరువోసినటుల మనస్థిమితము గలిగి యుండగలడా! ధనము 'ధనమూలమిదం జగత్తు' చేతిలో పడునంతవరకు ఎన్నిశ్రీరంగనీతులయిన చెప్పవచ్చును. హస్తములోనికి వచ్చిన మీదట మాటనిలుపుకొనుట కష్టముగదా! పాపము అదియే మన బేకను హృదయమును గుంజు లాడించి తుదకు కాలుపెల్లగించ గలిగినది. అయ్యది మానవ వ్యక్తులకెల్ల సహజమేగదా! మోటార్లు రెండింటిని సుమారు ఫర్లాంగు దూరము వ్యత్యాసముండవచ్చును. బేకను స్పష్టముగ కానబడుచుండెను. ధామ్సను మోటారు మెల్లనబోవుచుండెను. బేకను మోటారు విసవిస జేయుచుండెను. మన ఆంగ్లయువకుడు విచ్చేయు మోటారును తీవ్రసూక్ష్మభావముతో నొక్క త్రుటికాలము జూచి, జేబునుండి పిస్తోలునుదీసి విచ్చేయు కారునకు గురుపెట్టి 'ధాం' అని గుండువదలెను. మోటారు వెనుకటివాయువేగమును రెట్టించుచుం

డెను. తృటిలో ధామ్సను మోటారును దృక్పథమునుండి దాటి పోయెను.

ధామ్సను పేల్చినగుండు బేకను మోటారు ముందుభాగము నకు 'ఢాం' మని తగిలెను. గుండు మోటారులోపలి యంత్రమునకు దగిలి 'టప్'-టప్-'టప్' మని పెద్దధ్వనిజేయుచు పెట్రోలుటాంకు అంటు కొనెను. బేకను ప్రాణసంరక్షణకై గుబాలున మోటారునుండి క్రిందకు ఉరికెను. బేకను భూమిపై బడిపోయెను. మోటారు తిన్నగ ఒకవృక్షము నకు ఢీకొని భూమిపై గూలిపోయెను.

చదువరులారా! ఈధామ్సనను మీరు ఆపాదమస్తకము పరి శీలించితిరా! ఇప్పుడాతని భయంకరాకారమును మీదృక్పథమునదిలుపు కొనిన మీహృదయము చలించుటలేదా! ఇంతటికార్యము—ఇట్టి నిర్దాక్షిణ్యభావము—అట్టి యనివార్యసాహసము. మానవమార ణయందాసక్తి-లోకభయంకరుడగు బలేరామునకు తక్క తదన్యులకు లేదనిఘోషింపుచు ధామ్సనునే చోరనాయకుడని నిరూపించుటలేదా! ఇప్పట్టున మీరు ధామ్సనును చూడనోపుదురా! ఆతని ఘోరకృత్య ముల నింకను పరిశీలింపవలదా! పోనిండు! మీరుచూడజాలకున్న సర్వము మేమే విశదబరచెదము. బేకను దుకాణము నందలి యాంగ్లే య యువతి వార్తాపత్రికనింకను తిరుగవేయుచుండెను. చూచినదే మరల చూచుచుండెనో-చూచుచున్నటుల నటించుచుండెనో-కాని, ఊ-అనదు- ఆ-అనదు నవ్వదు-పెదవి కదల్పదు- దృష్టి మార్చదు- చేయిత్రిప్పదు- భావప్రకటన కనుపరుపదు-తొలుత ఎట్లుకూర్చునియున్నదో యిప్పుడు ను అంతియే.

ఏదెట్లున్న నేమి? కాలచక్రముమాత్రము గిరగిరదొర్లి పోవుచుం డెను. నిమిషములు పావుగంటలు అరగంటలు గంటలు సాగిపోవుచుం డెను. బేకనువచ్చుజాడల కనుబడుటలేదు. ఈయువతినిగాంచినకొలదిని

జేకను తాజేదార్లకు ఆశ్చర్యమధికమగుచుండెను. వారామెసమీపము నుండి బోవుచుండిరి. కరతాళములు వాయించుచుండిరి. పిలుచుచుండిరి. నవ్వుచుండిరి. గడబిడజేయుచుండిరి. కాని యామెమాత్రము మానము ద్రివహించియేయుండెను. జేకనునౌకరులు ఆయువతికి ఇరుప్రక్కలనిలువబడి యుండిరి. వారల కంతకంతకు ఆశ్చర్యసంభ్రమములు పెచ్చు పెరుగుచుండెను.

ఎట్టకేలకు బాయి అను నాతఁడు జాన్నుచూచి ఔరా! మన యజమాని పూర్తిగ మోసపోయినాడు. ఇది విగ్రహము కాని మానవవ్యక్తిగాదు. బూటకముకాదు నాటకమే! చేతియందు పత్రికను బెట్టి యలక్ట్రిక్ క్రొంటుచే నడిపించిరి. కేవలము మోసము మోసము దగా మెడ్రాసుటోపీ అనియరచి యావిగ్రహము చేతియుందలి వార్తాపత్రిక నూడబెరికెను.

వార్తాపత్రికను లాగినతోడనే చట్టుమనుశబ్దముయి 'ఢాంఢాం' మని రెండుగుండ్లు విగ్రహము కిరుప్రక్కలనుండి యుబయల్వెడల బాయి నున్ను జాననున్ను తాకి వారినుండి దూసుకుపోయి కట్టెదుట నున్న బీరువాలకుతగుల్కొనెను. సరకులతో నిండినబీరువాలు గుభాలున పుడమిపైగూలెను. జేకను నౌకరులిరువురు గుబాలున భూమిపై బడిపోయిరి. విగ్రహముక్రింద కూలిపోయెను. ఈ ధ్వనంతయు దుకాణము నందు మారుమ్రోగెను. ప్రక్కనున్న దుకాణదారులు రాజబాటపై వచ్చుచుపోవు పౌరులు బిలబిల లోనప్రవేశించిరి. వారెల్ల నాభయంకర ప్రదర్శనమునుగాంచి స్తంభించిపోయిరి. ఇంకనుమెట్టి ప్రమాదము సంభవించునో యని చోరవజేసి లోనికి పోజాలకుండిరి. దుకాణమంతయు ప్రేక్షకులతో నిండిపోవుచుండెను.

క్రమక్రమంబుగ నీ యుదంతము పురపాలక "సంఘాధ్యక్షునకును రక్షకభటాధికారులకును తెలిసి వారెల్ల నచ్చోటవెలసిరి. వారు

సాహసించి లోనికిబోవుచుండ వారితో పౌరులు కూడ ప్రవేశించుచుండిరి. జాన్సు, బోయి రుధిరమును గ్రక్కుకొనుచు కరచరణములను గొట్టుకొనుచుండెను. నయనద్వయమును సగము మూయుచు తెరచుచు మధ్యమధ్య దాహమని కాబోలు హస్తములతో నోరును దట్టుకొనుచుండిరి. పురపాలక సంఘాధ్యక్షుడు వారి హృదయసంచారమును గుర్తెంగి దాహశాంతి చేయసంకల్పించెను. ఆసమయమునధూళిధూసరమైన మేనుతో ప్రమాణాయాసంబుతో స్వేదసంకళితమగు నెమ్మోముతో పరావానల తప్తమానసముతో బేకనుకూడ తనయంగడిజేరి ప్రేక్షకుల హృదయములనెల్ల యథాయథలు గావించు శోచనీయ ప్రదర్శనమును కన్నులారా గాంచదొడంగెను. అతనినోటనుండి మాటలేక గాని పిచ్చివానివలె నాభీభత్సము నంతయు తిలకించుచుండెను. వడిపోయియున్న కామినీకైతనవిగ్రహమును రెప్పవాల్పక జూచుచుండెను. అతడట్లు గాంచుచుండ నావిగ్రహమునుండి జారిపడిన కాగితముపై యాతనిదృష్టి ప్రసరించెను. అతడుచివాలున దానిని దీసి యీక్రిందివిధమున జదువుకొనుచుండెను.

"శ్యామలరాయా !

నాసామర్థ్యము పరికించితివా ! వీడు చెప్పునదియొకటి చేయునది మరొక్కటియు గాదని గ్రహింపగలుగుదువా ! లోకభయంకరుడవగు నన్నును వంచింప సాహసింతువా ! నేనే నీపాలిట మృత్యువు. నన్ను బట్ట ప్రయత్నించువారికెల్ల మృత్యువును నేనేయని యెరుంగుము. నేనుసర్వవ్యాపకుడనని తెలుసుకొనుము నాకు మార్గావరోధము గల్గించి ప్రాణములను కోలుపోకుము.

బలేరాముడు వ్రాలు'

బేకను మందహాసముతో శిరఃకంపమొనర్చి యుత్తరమును రక్షకభటాధికారుల కిచ్చెను. వారు దానినిచూచి పురపాలక సంఘాధ్యక్షు

నకు గూడ చూపిరి. పాపము, వారాయుత్తరమును జనువుకొని కొంత తడవు దిక్కులు తరికించిరి. వారిహృదయములు దటదట గొట్టుకొను చుండెను. పాపము, వారేమి చేయగలుగుదురు ?

జాను బోయి, జీవించుదు రేమో నన్న యాశతో కాబోలును, వారిని చికిత్సాలయమునకు గొంపోవ ప్రయత్నించుచుండిరి. పౌరులు కొంద రాచోద్యమునింకను, తనివిదీరక గాంచుచుండిరి. మరి కొందరు జరిగినఘోరకృత్యమును గూర్చి వివిధరీతుల తలపోయుచు గృహోన్ముఖు లగుచుండిరి.

ఉత్తరక్షణమున నేమిజరుగుచున్నదో యెవ్వరు నిర్ధారణ జేయ గలుగుదురు.

---

## తొమ్మిదవ ప్రకరణము

---

శేకను అవయవములతోపాటు మానసముకూడ సంపూర్ణముగ నొచ్చెను. ద్రవ్యము నష్టబడెను. దుకాణము చిందర వందరయ్యెను నౌకరులకు గుండుదెబ్బ తగిలెను. పాపము అతనికష్టములన్నియు నొక్క మారు సంభవించెను. అతని మానసము 'నలుగురిలో నీవుతలత్రిప్పుకొ నగలవా ! పరాభవముకన్న ప్రాణత్యాగము మేలుగదా ! పురుషుడవై పుట్టినందులకు పరమార్థమేమి ! తలపశిన కార్యమును సాధించుటయే పురుషలక్షణము అని ప్రబోధించుచుండెను.'

పాపము, అతనికి మతిలేదు. ఆకలి కనుపించదు. మానసమునకు విశ్రాంతి లేదు. చీటికి మాటికి మోముమాత్రము కసికందుచుండును. అతడు తనదుకాణమును గట్టిబెట్టిబీగము వైచెను. పిచ్చివానివలె రాజబాటనుబట్టి బోవుచుండెను. అతడు తిన్నగ కారాగారకార్యస్థానముజేర సుదర్శన రావును, మరియిరువురు పత్తేదారులును ప్రస్తుతగడబిడలను గూర్చి

కాబోలు గూఢాలోచన జేయుచుండిరి. బేకను వారిని సమీపించి, తృటి కాలము మాత్రమేమియో రహస్యముగ సంభాషించి నచ్చోటు బాయు చుండెను. ఆతడు తిన్నగ రాజబాటబట్టి బోవుచుండెను. ఆత డెందులకు బోవుచుండెనో మనోగతాభిప్రాయ మేమియో గ్రాహ్యముగాకుండెను. చదువరులారా! థామసుబేకను చరిత్ర మీకేమైన బోధపడుచుండెనా? ఈతడెవ్వరో?

థామ్సన్ను బేకన్నును పిస్తోలుచే గాల్చి యాతఁడు తన నెలవు జేరెను. థామ్సన్నే బలేరాముడనుట నిర్వివాదమయ్యెగదా! ఇప్పట్టున ఆతని నివాసము తెలుసుకొనుటావశ్యకము. శ్యామలరావు గోపీనాథు నితో రహస్యమందిరమునుండి బయటకడిసతోడనే, యీతడు తన మాతృమందిరము మృత్యుగహ్వరముగనెంచి, తనబలముతో నందుండి వెడలిపోయెను. ఆత డెక్కడకు బోయెనో మనముకనుగొనుటకుసాధ్యము. అపరాధపరిశోధకశిరోమణులే, హంతకచక్రవర్తి రహస్యాగారమును తనబుద్ధిసూక్ష్మత ప్రచురబరచి నిరూపింపవలయుగాని, యీతనిసేరు తలంచినంతనే తల్లడిల్లు సామాన్యులు కనుగొనగలుగుదురా! బలేరాముడు బేకనుని వంచించి తెచ్చిన సువర్ణాభరణములను పరిశీలించుకొను చుండెను. క్రమక్రమంబుగ ఆతని మోము వివర్ణమగుచుండెను. ఆభరణములను ఇటునటు ద్రిప్పి చూచుచుండెను.

ఆతనిమోము స్వేదజల పరిపూర్ణమయ్యెను. వస్తువులను గాంచుచున్న కొలంది మోము జేవురించుచుండెను. ఆతడు పెదవిగరచి శిరఃకంపమొనర్చుచు "ఔరా! నా యనుమానమే స్థిరమయ్యె! నాకుతగిన వాడవునీవే! శ్యామలరాయా! చచ్చినటుల ప్రకటించి బేకను రూపముతో ప్రత్యక్షమయితివా! బంగారుపై పూతవస్తువులచే నను వంచించితివా! నన్ను వెంటాడ సాహసించితివిగా! పులిమీసలంది ఉయ్యేల లూగుచుంటివా! నిన్ను చేతులార చిత్రవధ గావించినగాని నేను కన్నుమూ

యను నీరుధిరము త్రావినగాని నాయక్కసుతీరదు. నీప్రేవులు ధరించిన కాని నీవు జచ్చితివని నేవిశ్వసింపను. ఔరా! నాతోనెక్కసక్కెము లురా! బ్రిటిషు రాజసర్వస్వము నిన్ను వెన్నుదన్నుచుండెనని మితి మీరుచుంటివా! దొంగరాముని అంతమొందించితినని విర్రవీగుచుంటి వా! దొంగరాముని యన్న సహజకూరసత్వము చవిచూచెదవు లెమ్ము". అని యాతడెద్దియో నిర్ధారణజేసుకొని కార్యక్రమమును జక్కబెట్టుకొనుటకు కాబోలు తనమందిరములోనికి చివాలునబోయెను.

చదువరులారా! బలేరాముని మనోగతాభిప్రాయమును గుర్తెరింగిన మీరు ధామసుబేకను అనునాతడెవ్వరో యూహింపజాలరుండు రా! మన మిప్పట్టున నగరులోని విశేషములను తెలుసుకొను టావశ్య కము. పౌరులు నేనేగావించిన ఘోరకృత్యములుగూర్చి వివిధరీతుల జెప్పుకొనుచు ఏనా డెవ్వరి కేమికీడు మూడునో యని ప్రాణములను గుప్పిడ నిముడ్చుకొని కాలముత్రోయుచుండిరి.

వివిధతావులనుండి యపరాధపరిశోధకులు విచ్చేసి దుండగీడును బట్టవలయునని వివిధమార్గముల నగరునం దంతటను గ్రుమ్మరుచుండిరి. దొరతనమువారు హంతకుని విషయమై మితిలేని ద్రవ్యమును వెదజల్లుచు, వానినిబట్టి యాతని రహస్యమందిరమును కనుగొనిన వారికి కోరిన బహుమాన మిత్తుమని ప్రకటించిరి.

నగరునందలి పరిస్థితు లిట్లుండ ఒక్కనాటి యుదయమున పురవీథులనుండి డాం, డిమువాయిద్య మొకటి వినవచ్చుచుండెను. పౌరులెల్ల దానిని శ్రద్ధతో నాలకించుచుండిరి. డప్పుగొట్టువాడు క్రిందివిధమున కేక లిడుచుండెను.

'రామశెట్టి కేసు ఈమేల యిచారణ జరుగుతుంది. మొన్న బే కనుదుకాణముమీద జరిగిన గడబిడలో రామశెట్టి ప్రోత్సాహమున్న

దని పోలీసువారు రెండవకేసు బెట్టినారు. కాబట్టి ఈయేల అన్నివిచారించి తగిన శిక్షవిధింతారు గాన అందరు రావలసినదోహో!'

టముక్కునూలముగా తెలియబరచిన సంగతులు నగరు వందంతటను విశదమయ్యెను. కొందరు రామశెట్టి నిరపరాధు డనుచుండిరి. దొరతనమువారు మెత్తనవారినే పీడింతురనుచుండిరి. మఱికొందరు రామశెట్టి సామాన్యుడు కాడనుచుండిరి. ఇంకను కొందరు దొరతనమువారిట్లు ప్రచురబరచుటలో యర్థము లేకపోలే దనుచుండిరి. ఎవరికివచ్చినటుల వారు ప్రసంగించుకొనుచుండిరి. నిజము దేవుడెరుంగు. నీరువల్ల మెరుగు నింతటితో సరియా! విచారణ ముగియులోపల దండగము లేమి జరుగుచున్నవో అని శిరఃకంప మొనర్చుచు పురజనులు కాలినడకను, గుఱ్ఱపు బగ్గీలపైనను, మోటారుకారుమీదను, జట్కాలమీదను మోటుబండ్లమీదను న్యాయస్థానము జేరుచుండిరి. సుమారు పదిగంటలగునప్పటికి, నేలయీనినటుల జనసమూహముతో కార్యస్థానమంతయు నిండిపోయెను. ప్రేక్షకులు ఒకరినొకరు గెంటుకొనుచు, దిట్టుకొనుచు స్థలముజాలక బాధపడుచు రామశెట్టికేసు పర్యవసానమును వినుటకై వేచియుండిరి.

న్యాయాధిపతి ధర్మపీఠము నధిష్ఠించెను. అతని కిరుప్రక్కలగా రక్షకభటులు ఆయుధపాణులై నిలువబడియుండిరి. న్యాయవాదులప్రక్కనే రక్షకభటాధికారులు కూడ గూర్చుండియుండిరి. లేఖరి నాడు విచారింపవలసినకేసు రికార్డు దీయుచుండెను. ఆసమయమున నలువురు రక్షకభటులు ఆయుధపాణులై మధ్య రామశెట్టి నిడుకొని న్యాయస్థానము జేరుచుండిరి. న్యాయస్థానమునందంతటను నిశ్శబ్దము నిరంకుశప్రభుత్వము జేయుచుండెను.

ఆసమయమున రామశెట్టి న్యాయవాది తనపీఠముమండి లేచి అయ్యా! రామశెట్టి ఈయూరుగల గొప్పవర్తకులలో నొకడు, అతడు

మిక్కిలి మర్యాదకుటుంబములోనివాడు, గౌరీపతిరావుగారి కుటుంబ హత్యలో యీతడేమియు నెఱుఁగడు. గౌరీపతిరావుగారి మేడను ఆరాత్రియే గౌరీపతిరావుకుటుంబము అంతమొందింపబడినది. మేడకొనిననాటి రాత్రియే రామశెట్టితమ్ముని హంతకులు గొనిపోయిరి. కొనుటయు, గౌరీపతిరావు కుటుంబము బలవన్మరణము నొందుటయు, గోపీనాథుని ఎత్తుకొని పోబడుటయు మూఁడును ఏకకాలమందే జరుగుటచే, రామశెట్టియే ధనాశచే యీ కుండగమును గావించి తన్ను శంకింపకుండ తమ్మునికూడ పరారీజేసెనని దొరతనమువారు తప్పు అభిప్రాయము నొంది రామశెట్టిమీఁదనే. నేరారోపణజేతురని హంతకులు పన్నినపన్నుగడగాని వేరుకానేరదు. అది యటుండఁగా హత్యజరిగిన మూఁడునాళ్ళకే రామశెట్టియింట దొంగతనము జరిగినది. ఎవ్వరైనను తనయింటికితాను కన్నము వేయించుకొనునా! అదియుగాక రామశెట్టి చెరసాలయందేయుండెనే! వర్తకసరళియందు మెలఁగుచు ధనముతో తులతూఁగుచుండు రామశెట్టికి హత్యలతోను పనియేమి! మూఁడవది బేరను మకాణమునందు జరిగిన దుర్ణయమోసము రామశెట్టికి తెలియుననుట హాస్యాస్పదము. న్యాయమునకు వ్యతిరేకము. రామశెట్టిపై దోషారోపణజేయుటగాని శిక్షించుటకుగాని యెంతమాత్రము అంగీకరింపను. ఈహత్యలు గావించిన గండరగండడిని హంతకచక్రవర్తిని పత్తేదారులు బట్టుకొనజాలక నిరపరాధియగు రామశెట్టిపై యీతుట్టను బారవైచి పైయధికారులవుండి తమకు మాటరాకుండ పన్నిన పన్నుగడగాని వేరుకాను. కాన ఇందలి న్యాయమింతియే యనినవారు నిశ్చయించి రామశెట్టిని విడుదలచేయించ గోరుచున్నాను.' అనిబల్కెను. తోడనే సుదర్శనరావు తనపీఠముపైనుండి లేచి 'అయ్యా! చట్టమునకును ప్రస్తుతవిషయమునకును సంబంధములేదు. నారాయణరావుగారు వాదించినటుల వారు నిరూపించిన కారణములను యోచించి రామశెట్టియే యీహుం

డగములన్నియు చేయుంచియున్నారు. రామశెట్టి మేధాసంపత్తి ప్రశంసనీయము- తరతమ్ముని పరాకిచేయుంచుటయును తన యింటికే కన్నము చేయుంచుకొనుటయు జరిగిన దొంగతనము వారు నన్ను శంకింపకుందురని రామశెట్టి వెర్రియభిప్రాయము నొందియున్నాడు. ధనాధికుడు అయినంతనే కుచ్ఛితుడు కాజాలడని జెప్పుటకు వీలులేదు. బేను దుకాణమునందలి సమాచారములో...' అని యాతడేమియో చెప్పుచుండ గుభాలున నారాయణరావుగారు లేచి 'అయ్యా! రామశెట్టి చితారు యేలినవారు తిలకించవలయు. అదియొక ప్రథలసాక్ష్యము. అది యటుండగా' అని యాతడేమియో నాదింపనుండ సుదర్శనరావు న్యాయాధిపతిం జూచి 'రామశెట్టి వ్రాత...' అని యేమియో పలుకతుండెను.

ఆసమయమున యెల్లరు ఆతురతతో నిరీక్షించుచున్న తరుణమును నిశ్శబ్దము న్యాయస్థానము నందంతటను ప్రబలియున్న కాలమున న్యాయాధిపతిమోం రామశెట్టి గజగజవణకుచున్న సమయమున ప్రజాసమూహమునుండి 'ఢాం' యను శబ్దము బయలువెడలి పిస్తోలుగుండు నిలువబడియున్న సుదర్శనరావు వక్షస్థలమునకు వగిలి ఈవలనుండావలకుబోయి న్యాయస్థానకుడ్యమున దూరెను.

సుదర్శనరావు తాళవృక్షమువలె భూమిపై పడిపోయెను.

న్యాయవాదులు గుభాలున తమ యాసనములనుండి లేచి ప్రాణభీతిచే యిటునటు పరువులెత్త గడంగిరి. న్యాయాధిపతి దిగ్గున తన పీఠముచుండి లేచి దిక్కులు పరికించుచుండెను రక్షకభటులు ఆందోళనతో న్యాయస్థానమున పరువులెత్తుచుండిరి. ప్రేక్షకులు కలగుండుపడి ప్రాణసంరక్షణార్థమై తమతమ వాహనములపై బిరబిర పారిపోవుచుండిరి. రామశెట్టినిలువబడి తెలతెలబోవుచుండెను. న్యాయాధిపతి సభయెంతయు రసాభాసమ్యేను. న్యాయస్థానమున మచ్చున కొక్క ప్రేక్షకుడు లేకుండాబోయెను.

## పదియవ ప్రకరణము.

చదువరులారా ! మనమిప్పట్టున బెజవాడ పరిస్థితులను గట్టిబెట్టి రాజమహేంద్రవరము జేరవలసియున్నది. పల్లివాడొకడు గోదావరీ మధ్యస్థమున, నొకచిన్న నావపై చేపలను బట్టుచుండెను. ఆతనికి సుమారు నలుబది సంవత్సరములు ప్రాయముండును. ఆతడు గోదావరిని, మీనముల బట్టుచు, రాజమహేంద్రవరమునుండి కొవ్వూరునకు పోవువారిని నావపై దాటించుచుండును. ఆతడెన్నడును తన చిన్న నావను వీడడు. భోజనము చేయుటయు పవ్వళించుటయుగూడ నావమీదనే ఆతడు తన నావను ప్రాణముకన్న నెక్కుడు భద్రముగా కాపాడుకొనుచుండును. రాత్రింబవలు కష్టపడుచున్నను, వానికి పొట్ట గడచుటయే దుస్తరముగానుండును. పాపము, తన అవయవములను సరిగా కప్పుకొనుటకు బట్టగూడ కరువుగానుండెను. ఆతనికి గోచీతక్క-మారువస్త్రములేదు. ఎన్నడును అరయంగుళమునకు మించని చుట్టపీకయే. పాపము, వాడట్లే కాలము త్రోయుచు దారిద్ర్య మనుభవింపజాలక కాబోలు నారాయణస్మరణ జేయుచుండును. పేదతనమునందే భగవంతునిపై ధ్యానము గలుగుట.

మన పల్లివాడు రాత్రి పండ్రెండు గంటలవరకును గోదావరియందే సంచారమొనర్చి, పిదప తన నావను కోటిలింగములవద్ద గట్టివేసి యాతడందే నిద్రించును. చదువరులారా ! కొవ్వూరునకును రాజమహేంద్ర వరమునకును వంతెనయుండగా మన పల్లెవాని నావపై నెవ్వరుదాటుదురు ! ఎవ్వరు పోకుండిన వీడు వెర్రియై వేచియుండునా ! రాత్రులందు రహస్య సంచారము సలుపువారల కితడు సహాయము చేయుచుండనోపు ! మనము రహస్యముగ ఈపల్లివానిని వెంబడింపవలసియున్నది.

గోదావరినుండి వచ్చు చల్లగాలియు, మధ్యమధ్య శృంగారావములును తక్క మరి సందడిలేదు. పల్లివాడు నావపై పరుండి కన్నులు మూసెను. ఆసమయమున దూరమునుండెవ్వరో, రహస్యసంభాషణ జేయుచు గోదావరితీరము జేరుచున్నటుల పొడగట్టుచుండెను. క్రమక్రమంబుగ విచ్చేయు పురుషులు స్పష్టమగుచుండిరి. ఆజానుబాహులును, స్ఫుటగాత్రులును, వికృతాకారులును నగు నలుగురు పురుషులు ఆ చిమ్మచీకటిలో మన పడవదెస కరుదెంచుచుండిరి.

చదువరులారా! వీరెవ్వరు? వీరు మీరు పూర్వపరిచితులేగాని యిప్పట్టున వారిని చూడజాలరు. మీరు వారినిగాంచిన గగ్గోలుపడి మనశ్శాంతిని కోల్పోవుటయేగాక స్థభించి ముందడుగు వేయజాలరు కాన వారి చర్యలనెల్ల మీరు వినికిడిజేయుటయే శ్రేయోదాయకము. వారెల్ల నావను సమీపించి మెల్లన 'అమ్మోరుగా! లెగు. లెగు' అని పిలచిరి. తోడనే అమ్మవారుగాడు 'ఊ-ఉ-ఉ' అని కన్నులను దెరచి కరచరణములను సాగదీసి కూర్చుండెను. ఎల్లరు నావలోని కెక్కిరి. అమ్మవారుగాడు పడవను వదలెను. వారెల్ల గోదావరిలో పయనము సలుపుచుండిరి.

వారట్లు నదిపై బోవుచు తమలో తామిటు ప్రసంగించుకొనుచుండిరి.

అ—బాబూ! చామలిరావు చచ్చిపోయినాడంట నిజమేనా?

దొంగ—చావక బతుకుతాడంటరా! దొరసంగతి యెరుగుదువా!

అ—దొంగరామయ్యకు అన్నింటిలోను అన్నియే—షహు—దొంగరామయ్యకు దినాలుచాలక చచ్చిపోయినాడుగాని చచ్చు చామలిరావుకు దొరికేవాడే! గాచారం బాగుండకపోతే గోదిలో పిసుగన్నాడు. చామలిరావు నిజంగా చచ్చాడంటావా?

దొంగ—చావడమే సిసలు. చావకపోతే ఆకీనెత్తుకు తాగుతానని దొర పతినబట్టాడుగా!

అ—అంతటోడే! అదిగో—అల్లప్పుడు శ్యామలరావును టోకరా గొట్టించడానికి దొంగరామయ్య గోదావరిలో మునిగాడే అప్పుడు నేను ఆతలరేవులో యుండే కాపు దాటించాను. ఆబాబునన్ను మామెచ్చుకొన్నాడు. మెచ్చుకొని—ఎధనా! ఈకుడవతో యెంత తంటాలుపడతావు నాజట్టులోకి రామన్నాడు. సరేబాబు అన్నాను. ఇంతలో ఆదొరకి కాలం సరిపోయినది. నాకు బాగుపడే రోజులు లేక పోయినాయి. అయితేంగాని మీరు నన్ను కూంత అనుగ్రహించాలి.

దొంగ—ఏంటిరా! నీయభిప్రాయమేంటి?

అ—ఏమండిబాబూ! మీరు చూస్తున్నారా! యీకుడవతో యెంత తంటాలుపడ్డా పొట్ట జరగడంలేదు. యేనో మీదయవుంటే యింత అన్నం తిందామని. దొంగరామయ్యగారుమాట మీరు జరపాలి కందా?

దొంగ—అయితే మాలో కలుస్తానంటూ వాంటిరా చెప్పు.

అ—మీదయ బాబూ! నేకోరినది అంతే. మొన్న యేలికతో కూడా చెప్పుకున్నాను.

దొ—ఉ. చెప్పుకున్నావు! ఏమన్నాడు?

అ—మీరంతా ఉ అంటేసరి అన్నాడు-ఇక్కడయీలాల్లేకపోతే బెజవాడ జట్టులోకలుపుతానన్నాడు-నాకు బను ఇక్కడుందిగాని అక్కడలేదు. రక్షించాలి. సెలవు దయచెయ్యాలి. ఎప్పుడూ మిమ్మునాశ్రయించు కొన్నోడనే!

దొం—ఒరే! దానికేంగాని నీవుమాతోవచ్చి యేంచేయుగలవురా! చెప్పు. ఆపై సంగతిమాద్దాం.

అ—ఏంటీ ! అల్లాగా ! తమాసా ! సూత్తారా ! ఎర్రిపిల్లిపుటుండా కోడు కనుకొంటున్నారు—నేసరింగా తలంచుకుంటే మీారందరునుకో! తన్నులరవల అన్నమాట ఏల్లాగాఅన్నారు కనక నాదెబ్బ యీామాల చూసి-మీాకన్న పైమెత్తుగావుంటే బలేయునండి లేకపోతే ఎదవాఅని దవడమీాదలాగి ఆతలికి పడగెంటుండి-కన్నానికిపోయి గుప్తానిపత్తాను-ఇట్టెకనపడి అట్టే మాాయంఅవుతాను. మసిపూసి మాారేడికాయ చేత్తాను-మనకి యిద్యకొత్తది కాదు- అయితే కొనాళ్ళుతిరిగి సరియైన జట్టులేక ఆఖరికి పడవలోకి దిగాను. నానంతట నేనే తంటాలుపడగలను గాని పేరెల్లినజట్టుతోయుంటే చేసినపని రెట్టికి రేణింపుకేవత్తుంది. నాల్గు డబ్బులు కలసివత్తాయి-ఈను ఎంతెంతలు పనిజేసేడానిమీాయూక-చామలిరావు బాబులంటోలు మనదగ్గిర ఆగరు తింటేగానిసుచేం తెలుస్తుంది-నావద్గ్గ కూతంత చూద్గురు.

దొం—ఒరే ! నిజమేకామోసుగాని-నువ్వుమాతో కలుత్తే చిక్కొత్తుందిరా ! నికేదోమాంతో కాంతో పారెత్తున్నాముగాదంటరా నీకెందుకు చమ !

అ—చమాలేదు చిక్కు లేసు నేకూడ మీాలోకలుత్తే పగలు రాత్రయిపోతుంది. గోదావరంతా కల్లుఅయిపోతుంది. అంతామనోళ్ళయిపోతారు. మీారు నాకు చేహింతులయినందుకు నాయిద్దె పోవలసినదే! నేనుంటే మనకెంతలాభమో తెలుసునా ! రెండువాళిలున్నాయి గహించుకోండి.

దొం—నువ్వు మాాలో కలుత్తే రేవుదాటడం మాాటేంటి?

అ—ఆ. అదే నేసంట! రేవుదాటించోడిలాగు వుంటాను! అసలైనోళ్ళని మన రేవుకుపట్టింతాను-రొండోది, అర్ధరాత్రోళ మనమంతా అసలైనయిళ్ళు చక్కబెడదాం-గాచారంజాలక యెవరేనా కుండాబడతారా ! మీారు నావదాటేవాళ్ళు నేను దాటించేవాడ్ని—ఊఁ ఈఁ

యెంతబాగుందో గ్రహించుకోండి-అవలయిన స్థలాలు ఒకటి రెండు చూచి వుంచాను.

దొం—ఓరీ సీతన్నలరవ్వల చంపేత్తున్నావు. ఇంత వుస్సారే ఉన్నోడిన్ని జేర్చుకోవలసిందేగాని- ఒరే- ఒక్కటేమూట ఈయేలగాక యేదైన మెట్టుబేరం నీయంతటనీవుగొట్టవా అది దొరకిజూపి, నిన్ను ఒకజట్టుకే మేత్రికింద సిఫార్సుచేత్తాం-మరివోపికుంటే చూసుకో- మాట్లెందుకు?

అ—బలే ! నచ్చింది-అదిగో అల్లగన్నావుబాగుంది-లచ్చరాలు కిమ్మత్తైనమాట-

దొం—నువ్వొక్కడవే యెల్లాలి అదిచూచుకో.

అ—వహ్వా ! మీరంతావత్తేవా తెలివితేటలేమున్నాయి. ఇదినాకు పరిచ్చగాదు.

దొం—అవునురా పరిచ్చే ఈయేలతేల్తుంది- సంగతి.

అ—ఇంకేయిమాటలెందుకు-వచ్చింది-నాఅంతటోన్ని నేనేగాని మీలోకలిస్తే గొడుగెత్తినట్టుంటుంది-అదినాభయమ-ఇంకెందులకు అమ్మ వారుగాడు చాకచక్య ఈయేల తేలాలి.

దొంగ—అయితే సిస్సలే.

నావ క్రమక్రమంబుగ కొవ్వూరు జేరుచుండెను. పడవ రేవును జేరగనే వార్తలెల్లదిగి పట్టణ ప్రవేశము గావించుచుండిరి. అమ్మవారు గాడు తననావను యొడ్డుననే గట్టిపెట్టి తనమిత్రుల ననుసరింపక వేరు మార్గమున గ్రామములోనికో మరియొక్కడకోగాని బోవుచుండెను. చోరులెల్ల నగరుజేరిరి.

ఆనాడు కొవ్వూరునందు సుప్రసిద్ధనటులచే హరిశ్చంద్రనాటకము ప్రదర్శింప బడుచుండెను. మిక్కిలిప్రసిద్ధికెక్కిన నటకులగుటచే ఆప్రదర్శనమును జూడ చాలాదూరమునుండి ప్రేక్షకులు విచ్చేసియుం

డిరి. ఎక్కడజూచినను సందడియే; ఏయింట కనుగొనినను గుణగణ మాట్లాడువారే, ఏవీధిని జూచినను వచ్చుచుబోవువారే. పాపము వారెల్ల ఒకవీధినుండి మరియొకవీధికి, ఒకసందునుండి మరొక్కసందునకు బోవుచు నిశ్శబ్దముగా నున్నగృహమును పరిశీలించి యందుప్రవేశింప నుద్యమించుచుండ లోనుండి "అబ్బాయి! నాటకమునుండివచ్చినాడ వురా!" అన్న పలుకులు వినవచ్చుచుండె. కొందరు చీటికి మాటికి వీధి తలుపులు తెరచుచు రాజబాటవంక కొంతవడిచూచుచు 'నాటకము కాలేదుకాబోలు' అని లోనికిబోవుచుండిరి. పాపము నాడాహర్తకులకు శ్రమతక్క మరేమియు కనుపింపదయ్యె. వారు వేసరక తిరుగుచు నేయుండిరి. కన్నములు పొడుట లేక. అట్టే చాలకాలము దొర్లిపోయెను. రాత్రి సుమారు రెండుగంటలుదాటిపోయెను. నాటకము సమాప్తమయ్యెను. ప్రేక్షకులు గృహోన్ముఖులగుచుండిరి. పట్టణమంతయు నిండు సందడి పర్వెను. నటకులు గుణగణముల వర్ణించు వారితోడను సంగీతమును మెచ్చుకొనువారితోడను రచనానైపుణ్యమును శ్లాఘించువారితోడను దుస్తుల నుగ్గడించు వారితోడను నటకులందరు చూపినరసాభాసల దలంచి నవ్వువారితోడను పట్టణరాజబాటలన్నియు నిండిపోయెను. అట్టియెడ మనచోరులకు కన్నము లెట్లుపారును! వారిసామర్థ్యత యేమి సేయగలుగును. సాహసించిన కొంపమునిగియేతీరును. అందులకే కాబోలు వారెల్ల తమకార్యమునుండి విముఖులయిరి. దొంగలు దూరాలోచన జేసి రిక్తహస్తములతో వెనుకటిదారిని బట్టి నటకులను దూరుచు గ్రహస్థితిని దిట్టుకొనుచు పోవుచుండిరి.

ఇట్లుండ కొంతవడికి వారిదెస యెవ్వరో వినవిన విచ్చేయుట గోచరమయ్యెను. విచ్చేయు వారిని నిదానించి చూచుచుండ మోములు సంతసమును సూచించుచుండెను. హేతువేమై యుండును. అమ్మవారుగాడు వచ్చుచుండుట యేయని మాపాతకమహాశయులు

గ్రహింతురు గాక ! ఆతడు విసవిస విచ్చేయుచుండెను. ఆతని మోము సంపూర్తియుత్సహామును సూచింపుచుండెను. దొంగలెల్ల అమ్మవారుగాని గుర్తించి వదియంగులు ముందుకరిగి వానిని కలుసుకొనిరి. అమ్మవారిగాని గుండెలు దటదట గొట్టుకొనుచుండెను. శరీరము స్వేదసంకలితమయ్యెను. శ్వాసలాఘికముగ వచ్చుచుండెను అమ్మవారుగాడు తన మిత్రులనుగాంచి 'నా బెక్కుడు' అని బలికెను. వారు తమమిత్రుని చేతులలో నున్నమూటనుచూచిరి. వారియానందము మేర మీరెను. వారెల్ల అమ్మవారిగాడి చేతులలోనున్నమూటను దీసుకొని పరీక్షించి యానందమును బట్టజాలక అమ్మవారిగాడిని యెత్తుకొని నావలో కూర్చుండబెట్టిరి. ఎల్లరు నావలో సుఖాసీనులయిరి. అమ్మవారుగాడు దొంగిలితెచ్చినసువర్ణాభరణముల నొక్కొకదానిని తీయుచు బ్రహ్మానందమొందుచు అమ్మవారుగాడు సామాన్యుడుగాడనివిశ్వసించుచు వాని సామర్థ్యమును తమయేలికకు నివేదించి వానికొకజట్టున కాధిపత్యమిప్పింపవలయు నని సంకల్పించుకొనిరి.

---

పదునొకండవ ప్రకరణము.

---

బెజవాడ పేటయు అల్లకల్లోలముగ నున్నది. పౌరులు దినమొక యుగమువలె గడుపుచుండిరి. ఏనాడెవరి కేయిక్కట్టు మూడునోయనితల్లడిల్లుచుండిరి. రామశ్రేష్ఠి కేసు విచారణజరుగుచుయుండెను. న్యాయస్థానము జుట్టును రక్షకభటులాయుధపాణులై కావలియుండిరి. పౌరులు వెనుకటి రీతిని న్యాయస్థానము జేరుట లేదు.

మధుసూదనరావును చికిత్సాలయమునకు గొంపోయిరి. ఆపరాధపరిశోధకులు, అపరాధముగావించిన నేరస్థునివిషయమై శ్రద్ధవహించి జాడలు దీయుచుండిరి.

బేకను ప్రకృతమున నగరమందెక్కడను కాన్పించుటలేదు. అతని గూర్చి తెలుసుకొన యత్నించువారును కనుపించరు. ఆతఁడేమయ్యెనో! న్యాయస్థానమున లేఁడు—అతనిదుకాణము మొదలే లేదు. అతనియనుచరుల సంగతి తెలియుటలేదు.

ఆతఁడు నేనే విషయమై దొరతనమువారికి తెలియఁబరచి, పట్టణమునందుండిన, ప్రాణాపాయము కూడ సంభవించునని యెంచుకొనలేక పోయియుండునా! ధనముకోల్పోయి, పదుగురిలో న్యూనతకాంచబడిన యాతఁడు, కండ్లుమూసికొని యుండునా! పరాభవములను, రక్తము, శిరోవ్రణతను గాంచి ప్రతీకారము సేయింప కరుగఁడదా! అయ్యది ప్రాకృతలక్షణమే! బేకనువిషయమై మనమేమి యూహించుటకును వలను పడదు. నిలకడమీఁదనిజము తేలకుండునా! కానిండు! కొంతకాలము మనముకూడ బేకన్ను మరచియే యుందము.

కృష్ణానదివంతెనకు ఉత్తరమున, నూతననిర్మాణహర్మ్యమొకఁడు కలదు. అయ్యదిరాజబాటనందు లేదు కాని, కొలఁదిదూరమున మాత్రమున్నది. సౌందర్యముపై సౌందర్యమును జిలుకుచు, శిల్పశాస్త్రపుణ్యమును వేయినోళ్ళ ప్రకటింపుచు మహేంద్రుని వైరావతమోయన శోభిమీరియున్న నా సౌధరాజము, రాజబాటపై వచ్చుచుబోవువారల దృష్టినాకర్షించుచుండును. ఆమేడజుట్టను సుమారు నాలుగడుగులు నిడివిగల ప్రాహారిగోడ కలదు.

చదువరులారా! విలాసభవనమును జూచినంతమాత్రముననే మనోవైకల్యము నొందకుడు—ఇంతమాత్రమునకే మీమానసములు స్వాధీనముదప్పిన మందిరప్రవేశముగావించుట దుర్ఘటముసుమీ! మెల్లన ఆరామప్రవేశముగావించిన నయనద్వయమును తెరచిసౌధాంతర్భాగమునొక్కసారి తిలకింపుడు. మీరు చూచునదేమి! మీరేమికంటిరో యూహింపఁగలరా! సౌధాంతస్సీమ కుసుమసుకుమారాంగులగు కామినీ

కుసుమములచే వికసితమై ప్రధమసందర్శనముల నే స్త్రీమాయా
మోహితు, జగత్తు, అనవత్యమును దృఢీకరింపుచు మాయునికి
వివాహనిర్బంధనముల జేయుట లేదా! విలాసభవనమున మరియేమి ? ఆ
నవతారుణ్యవతుల శరీరకాంతి పదియార్వన్నె మేలిమిబంగారునకు గలు
గునా! తనూవిలాస మునకు శోభకనుల మిరిమిట్లుగొలుపు కాంతిప్రభల
నిగుడు నవీనవస్త్రాభరణముల ధరించి ధవళకుసుమమాలికలగట్టి—నిడుద
కన్నుల వాలుచూపులతో—సుందరమందహాసరోచులతో—ఇక్షుర
సమునతోబోసి రాజహంసమృదుతర సంభాషణలతో—దిక్కాంతలకు
చైతన్యమువహించు గాత్రిగాంధర్వముతో—మీకు గోచన గోచరము
గుట లేదా! కొందరు తన్వంగులు హస్తద్వయమును గౌనునజేర్చి వ
య్యారముట్టిపడ ఇటునటు నడయాడుచు—రాజబాటపై బోవుపురుషు
ల కేరికంట వీక్షింపుచు—దరహాసమున ఒండొరులమోములు వీక్షిం
పుల నవసంతవదనులగుట మీకృప్పాక్షమున పడుచుండ వారల నాసమ
యమున గాంచిన యువకులహృదయము సంచారమెట్లుండునో మీహృద
యదర్పణముల మీరుగాంచవలయునే గాని మాకువర్ణనాతీతము. చదు
వరులారా! వీరెవ్వరై యుందురో మీరింకను గుర్తింపజాలరా! వీరు
వారవధూమణులు గాక మరెవ్వరు ?

సాయంసమయమగునప్పటికి విలాసభవనమునుండెవ్వరో యొకయు
వకుడువిచ్చేసి, భవనముముంగట వేచియున్న మోటారుకారులోనికి
నెక్కెను. ఆతడు ధరించిన మలినంపు దుస్తులను చేతులనంటుకొనిన
మాలిన్యమును, మోమువయిచిందరవందరగా వ్రేలుచున్న కూృపిం
గు, నోటియందలి సిగరెట్టుపీకయుగాంచ, ఆత డామోటారుడ్రయివరని
తోచుచున్నది.

ఆతడు మోటారును నడిపించుచుండెను. అందెవ్వరును లేరు.
మోటారు పురవీధుల నెల్లదాటి, బెజవాడనుండి కొవ్వూరునకు గల
రాజబాటపై పరువిడి బోవుచుండెను.

అమ్మవారుగాడు రహస్యమందిర మంతయు స్వేచ్ఛావిహారము జేయుచుండెను. హర్తలు నిశాచరులగుటచే హాయిగ విశ్రమించియుండిరి. అమ్మవారుగానిబోలు, నాయకుడు వారలకు లభింప మైమరచి నిద్రించుట కభ్యంతర మేముండును ? దొంగలెల్ల ఆదమరచి నిద్రించుచుండిరిగాని- అమ్మవారుగాడికి మాత్రము కునుకు బట్టుటలేదు- కాలొకచోట నిలుచుటలేదు. మనశ్శాంతి గలుగుటలేదు. ఆత డిటు నటు దిరిగి, తీవ్రశోధనచే తనవారెల్ల గాఢనిద్రను జెందిరని గ్రహించి, దొంగరాముడు పూజావిధానము సలుపుగదిలోనికిబోయి తలుపులుబంధించుకొనెను.

ఈగది ప్రక్కనే మరొక్క మందిరము కలదు. అది బీగముపైచియే యుండును. ఈరెండుగదులకు మధ్యగోడ ఎత్తుగా నుండెను. కాని సామాన్యమానవుడు గోడపైనుండి క్రిందికు దిగవచ్చును, తాళముపైచియున్నగదియం దేమి గలదో మనకు దెలియదుగాని, అమ్మవారుగాడు మాత్రము మెల్లన- అలుకుడుగాకుండగ, గోడ పైభాగమునకెక్కుచుండెను. ఆతడు గోడనెక్కి అంధకారములో క్రిందికి జూచెను. ఆతడు రిత్తపడెను. మోమున సంతసము మొలకలెత్తెను. హృదయము తేలికపడెను. కాని కన్నులు అశ్రుపూరితము లయ్యెను. చదువరులారా ! అమ్మవారుగాడి మనోవిలాసమునకు హేతువు మీరు గుర్తింపజాలరా! ఆచీకటికొట్టునందొక మూలగల మలినవస్త్రముతో, మోముపై చిందరవందరగ వ్రాలి దీర్ఘనీలకుంతలముతో, కన్నీరు కారికారి చాలికలు కట్టిన చెక్కుటద్దములతో, సోయగమును కరిగి ప్రతిమపోసినటుల పరిపూర్ణావయవశోభావిరాజితయగు తన్వంగి పరుండియుండు టాతనికి దృగ్గోచరము కాదా! సంతాపసంభ్రమములు కలుగుటలో అబ్బుర మేమియుండును?

ఈవనిత యెవ్వరో మనకు తెలియదు. అమ్మవారుగాడు మెల్లన లోనికి దిగుచుండెను. ఆసుకుమారి కలవరమొంది కన్నులు దెరచెను. తోడనే యాపె తెల్లబోయెను. శరీరము కంపింపదొడగెను. కన్నులు అశ్రుజలపరిపూర్ణము లయ్యెను. ఆపె యాదోంళనతో గద్గదులువడుచు నిలువబడెను.

ఆసమయమున అమ్మవారుగా డామెనుచూచి నమ్రభావము చే సంజ్ఞ జేసి లోనికి దిగెను. పాపము ఆసామజయానశరీరము మాత్రము కంపించి బోవుచుండెను. ఆసమయమున,

అ—అమ్మా! భయములేదు. నీకు హానిజేయువాడనుగాను. చేతనైన సహాయము జేయువాడను. నే నడిగినప్రశ్నలకు సదుత్తర మిమ్మా! "మీరేదేయూరు?" అని బలికెను. ఆమె చీరెచెంగుసర్దుకొని కంఠమును సరిజేసుకొనుచు.

స్త్రీ—తండ్రీ! యిన్నినాళ్ళకు చల్లనిమాట వినిపించిన నన్నుద్ధరించుటకువచ్చిన మహానుభావుడవు. నాకు పితృసమానుడవు నీయొద్ద దాపురమా! తండ్రీ! మాది బెజవాడ.

అ—మీ రెవ్వరు ?

స్త్రీ—బ్రాహ్మణులము.

అ—మీయత్తవారిగ్రామము తల్లీ!

స్త్రీ—బాబూ! కాకినాడ.

అ—మీతండ్రిగారిపేరు.

పాపము. ఆపె కంటదడి పెట్టసాగెను. ఎంతప్రయత్నించినను దుఃఖసాగర సముద్రతరంగములవలె పొంగిపొరలి వచ్చుచుండెను.

అ—అమ్మా! ఏడ్చిన లాభమేమి! కర్తవ్యము చూచుకొన వలయు.

స్త్రీ—గవ్వల గౌరీనాథంగారు.

అ—అమ్మా ! నీ విక్కడి కెట్లు వచ్చితివి ?

స్త్రీ—నాతండ్రి ధనికుడు. నాకు ఇరువురు చెల్లెండ్రు. ఇరువురు సోదరులు కలరు. నా యన్నకు చదువు లేక దుష్టసాంగత్యమున కలవడెను. మాతండ్రి గ్రామములలోని మేడనమ్మి ఇరువది వేలరూప్యములు ఇంటికి దెచ్చెను. ఆరాత్రియే మాయింటదొంగలుపడి నన్నుతక్క అందరిని జంపివేసిరి. ఆరాత్రియే నన్నిట బంధించినారు. వారికళేబరములను ఎక్కడకో గొంపోయిరి. ఇదియెల్ల నాయన్న తెలివితక్కువమీదజరిగిన దుండగములు. తండ్రీ ! అయిన దానికేమిగాని దొంగలనాయకుడు ప్రత్యక్షనరాంతకుడు. భయదస్వరూపుడు- నన్ను- అన్నా! నాడుశ్రీకృష్ణుడు ద్రౌపదీమానసంరక్షు గావించె- నీవు అరవిందామానసంరక్షణ జేసి ఆర్యావర్తనమున వన్నెకెక్కుమా! అన్నా! ఆ నరాంతకుని మాట దలంచిన శరీరము కంపించుచున్న దయ్యో- నేనే- నీసోదరి మానభంగము సహింతువా! నీవు దైవస్వరూపుడవు. అన్నా! అబలను అసహాయురాలను. దిక్కు మొక్కులు లేనిదానను.

అ—అమ్మా! ఏ మీ బేలతనము- ధైర్యమవలంబింపుము. సర్వమునకు సర్వేశ్వరుడే కలడు. నీభర్త ఎక్కడ ?

అర—అన్నా ! ఇంగ్లాండులో.

అ—ఏమి చేయుచున్నారు.

అర—బారెట్లా- చదువుచున్నారు ?

అ—ఎప్పటితో ముగింపగునో తెలియునా ?

అర—ఈసంవత్సరముతోనే.

అ—అమ్మా నీవు విద్యావివేకురాలవు. ధైర్యమును వీడరాదు.

అర—అయ్యా! మీ రెవ్వరో నాకు తెలియదుగాని, నాయవస్థ ఆర్తరక్షణబిరుదాంకితుడగు శ్యామలరాయున కెఱింగింతురా ! లేక మీరే పున్నముగట్టుకొందు- నా—మాన.

అ—శ్యామలరావు బలేరామునిచేతిలో—

అర—అబ్బ ! భగవంతుడు శ్రీహరి లేకుండునా ! శ్రీహరినిగూర్చి చెప్పుగాధలన్నియు పుక్కిడిగాధలగునా ! హైందవాంగనల సౌశీల్యప్రభావము నమసిపోయెనా ! అన్నా ! నాహృదయము శ్యామలరాయునకు సేమమేయని చెప్పుచున్నది.

అ—తల్లీ యధార్థము తెలుసుకొనవచ్చునుకాని నీవుమాత్రము నీరెట్లుజెప్పిన అట్లేచేయుము.నీకేమియు భయములేదు. నేను మరల కలుసుకొందును. నీమానసంరక్షణ త్రిమూర్తులడ్డినను జేసితీరుదు. చింతిల్లకుము.

అర—చిత్తము మీసోదరిని యేమరి యుండకుడు.

అ—భయములేదు.

అమ్మవారు గాడుమెల్లన గోడనెక్కి వెనుకటిరీతిని తనగదిలోనికి జేరెను. ఆతడు బయటకరుదెంచి నిద్రబోవుచున్న తనమిత్రులను లేపి యాతడు గోదావరీతీరమున జేరుచుండెను. అప్పుడప్పుడే చీకటికమల జాండమంతయు వ్రిబలి ఘనీభవించుచుండెను. అమ్మవారుగాడు నావను గోదావరిలో త్రిప్పుచుండెను. దొంగలెల్ల మేల్కాంచి, తమవిధివిధానములజక్కజేయ సంసిద్ధపడుచుండిరి. రాత్రి సుమారెనిమిదిగంటలు కావచ్చెను. బెజవాడలో బయలుదేరిన మోటారు కొవ్వూరువంతెన వద్దకు జేరెను. అమ్మవారుగాడు నావను కొవ్వూరురేవున కట్టిబెట్టి యొందులకో నిరీక్షించుచుండెను. ఆసమయమున మనమోటారుడ్రైవరు వంతెనప్రక్కనే కారునాపి అమ్మవారుగానిదెస విచ్చేయుచుండెను. వానినిగాంచగనే అమ్మవారుగాని మోము వికసించెను. వారిరువురు ఈక్రిందివిధము న వ్రసంగింపనొడగిరి.

అ—కారు నెక్కడాపితిరి ?

డ్రై—వంతెన ప్రక్కనే.

అ—నేజెప్పిన ఏర్పాటులన్నియు జేసితిరా ?

డ్రై—చిత్తము.

అ—మనవారందరు సిద్ధముగనున్నారా ?

డ్రై—ఉన్నారండి.

అ—దారిలో నీకెవ్వరైన యెదురుపడిరా ?

డ్రై—లేదండి.

అ—సరియే. మోటారును ఈపంచకు తీసుకొనిరమ్ము. నేను అయిదు నిమిషములలో, మేళమంతటితోను వచ్చెదను.

డ్రై—చిత్తము.

అమ్మవారుగారు నావనెక్కి గోదావరిలో ప్రయాణముచేయుచుండెను. నావ ఆవలొడ్డు జేరగనే, నావికుడొందుండి దిగి, పడవను గట్టిజేసి పరుగుపరుగున రహస్యమందిరము చేరుచుండెను. తస్కరులెల్ల తమ తమ సన్నాహములతో ప్రయాణోన్ముఖులయి యుండిరి. ఆసమయమున అమ్మవారుగారు, దీర్ఘశ్వాసలతో, పాతాళగృహము చేరెను. అతని శరీరమంతయు స్వేదజల పరిపూర్ణమయ్యెను. ఆయాస మధికముగ నుండెను. చోరులెల్ల అమ్మవారుగారి యవస్థనుగాంచి విస్మయమున 'సంగతేంటిరా' ఈగడబిడేంటి ? అని బలికిరి.

అ—ఏంలేదురా ! దొర శలవయ్యింది వచ్చేసింది.

దొం—ఏమని ? ఏంటి ?

అ—ఈయేల బెజవాడలో పెద్దమేడకి కన్నమంట—రేపు నామనాధుకేసు తీర్పు జెప్పుతాడంట. ఈయేల ఊరంత గుభిల్లు మనేలాగు దెబ్బకొట్టాలంట—మన చాకచక్యంచూపి మనదెబ్బ పూరంతా బొబ్బవిపించాలంట—పదకొండు గంటలకి అక్కుడుండాలంట. దొర మనకోసం యెదురుచూత్తున్నాడంట మోటారు వచ్చేసింది ఆలస్యంచేత్తే దొర తన్నేత్తాడు. గుటుక్కునిలేవాలి లెగండి.

దొం—ఏంటిరా అఘాత్యం.

అ—అదే తమాసా ! పని యెప్పుడౌతుందో యెవరు జెప్పగల రేంటి !

దొం—అవును లే ! మనోళ్ళు యింకా ఉన్నారుగాదంటరా!

అ—ఆళ్ళని ఇంకోదిక్కుతోసాకుమిరాయేల మనపేరు హుళ్హూరై పోవాలా ? ఏహేయ్యి ఆమద్దెల దొర హఠాత్తుగా కబురుపంపిత్తానని జెప్పలేదంటరా ! అ దీయేలవచ్చింది.

దొం—మోటారు వచ్చేసిందేంటి ?

అ—ఆతలొడ్డున సిద్ధంగాఉంది లెగుండి చంపుతాడు.

దొం—మరి సామాన్లు మాటేంటి?

అ—ఏహేయి ఏంవద్దురా ! అక్కడ లేవేంటి. పయాణీకుల్లాగుండాలి మనం తెలిసిందా గహించుకోండి.

దొం—అవునురో మరి దీని మాటేంటి ?

అ—అరవింద మాటేనా ?

దొం—మరేనురా !

అ—ఇక్కడే ఉంచేత్తేరా ! తెల్లారి రామంట రామరి.

దొం—దొర దాన్నెందుకు తీసుకొచ్చారుకాదంటాడేమో

అ—అయితే ఆలస్యమెందుకు ?

దొం—యేసాలు మార్చొద్దు—

అ—త్వరగా,

దొంగలెల్ల ప్రయాణీకులవోలె బట్టలను ధరించుచుండిరి.

భీముడు అరవిందయున్న గది తాళముదీసి అందొక నల్లబురకాను దీసి, అరవిందనుజూచి ఏయ్యి ఈబురకాతొడుగు' అని బలికి నిలువబడెను. అరవింద మాటలేక నిలువబడియుండెను. ఆసమయమున భీముని ప్రక్కనేయున్న అమ్మవారుగాడు తొడుక్కో మాటకి తిరుగులేదు అని

బలికెను. వెంటనే అరవింద చేతులజోడించి బురకానుధరించెను. అర వింద తనచీకటి గదినుండి బయల్వెడలి తస్కరులెల్ల చేరియున్న చావిడి జేరెను.

తోడనే, దొంగలెల్ల అరవిందను మధ్యనిడుకొని పాతాళగృహ మునుండి బయల్వెడలిరి. వారెల్లమెల్లన గోదావరీతీరము జేరుచుండ మార్గమధ్యమున అమ్మవారుగాడు ఒక్కశ్శటికాలమాగి, భీమునిచూచి "మనోళ్ళంతావత్తున్నట్టేన!" అనిబలికి లెక్కింపదొడగెను. దొంగలు ఇరువైమందిగ తేలిరి. ఆతడు సంతృప్తిజెందెను. వారెల్ల కొంతవడి యు ల్లోనడచి, గోదావరినివేచియున్న నావనెక్కిరి పడవకొవ్వూరుచేరెను. అందరు మోటారు నెక్కిరి. డ్రైవరు మోటారువదలెను.

దొంగలెల్లతమలో తామెద్దియో గుసగుసలాడుకొనుచుండిరి. కాని అమ్మవారుగాడుమాత్రము మౌనముద్రవహించియుండెను. మోటారు క్రమక్రమంబుగ పట్టణములను పల్లెలను దాటి బెజవాడ జేరుచుండెను. అమ్మవారుగాడి యుత్సాహమధికమగుచుండెను. సుమారు రాత్రిపద కొండుగంటలు కావచ్చును. మోటారు బెజవాడపురవీధులనుండి పోవు చుండెను. నగరునందంత నిండు సందడి గాన్పించుండలేదు. మోటారు పురవీధులనతిక్రమించి విలాసభవనము జేరెను. తోడనే, అమ్మవారుగా డును, అరవిందయు కారునుండిదిగిరి. తరువాత తస్కరులెల్ల బయటకరు దెంచిరి. అమ్మవారుగాడు తనమిత్రులజూచి, "లోపలికి రండు" అని బలికెను. తస్కరులెల్ల లోనికిబోవుచుండిరి. అమ్మవారుగాడు అరవిందను తో వారల, వెన్నంటుచుండెను. వారెల్ల ఆరామప్రవేశము గావించి భవనము జేరుచుండెను. వారు సౌధప్రదేశము గావించుచుండగనే, వీధిద్వారము బంధింపబడెను. వారంతకులెల్ల సౌధసోపానముల నెక్కిరి. అంతర్భాగములోనికి బోవుచుండిరి. అమ్మవారుగాడు 'నడువుడు' అనుచుండెను. అంతర్భాగమున వారికెవ్వరు కాన్పింపలేదు. వారె

ల్లలోనికిబోవగనే, అమ్మవారుగాడు, ద్వారమును కాలుతో మెల్లనతట్టెను. తోడనే తలుపు మూసికొనిపోయెను. దొంగలు లోనికిబోయి చావిడిజేరి, ఆచావిడికిరుప్రక్కల నాలుగుగదులు కలవు. ఆచావిడినుండెటుల బోవలయునో మనతస్కరులకు దెలియక వెనుకవెనుకలు జూచుచుండిరి. అమ్మవారుగాడు మందహాసముతో వారిదరిజేరి 'షప్' యని యీలగొట్టెను. అమ్మవారిగాడినోటనుండి యీలవెలువడినతోడనే అందెందుండియో, దొంగలమూక బిలబిలాడుచు విచ్చేసిరి. దొంగరాముని యనుచరులగాంచి "అన్నలారా! ఇంతాలస్యమయినదేమి!" అనిబలుకుచు సోదరవాత్సల్యముట్టిపడ, ఒక్కొక్కరొక్కొక్కని కౌగలించుకొనిరి. మిగిలియున్న నూతనతస్కరులు దొంగరాముని సైనికుల వెనుకవైపు జేరుచుండిరి. ఆసమయమున అమ్మవారుగాడు హాసముతో మరలయీలగొట్టెను.

కన్నుమూసి తెరచునంతలో, అంతర్భాగమంతయు ఖడ్గపాణులగు రక్షకభటులతో నిండిపోయెను. దొంగరామునిసైనికులు తమహస్తద్వయములను కదల్పలేకుండిరి. వెనుకతట్టునజేరిన తస్కరులెల్ల మనపూర్వపరిచితులకు కరదండములు తగిలించిరి. పాపము, వారెల్లవిభ్రాంతులై తెలతెలబోవుచు తమకెట్టెదుట మందహాసమొనర్చుచున్న అమ్మవారుగాడిని తిలకించుచుండిరి. అమ్మవారుగాడిని గాంచుచున్నకొలందిని వారికి క్రోధశోకములు మిన్నుముట్టుచుండెను. అమ్మవారుగాడు తమ్మనెల్ల మృత్యుగహ్వరప్రవేశముగావించెనని ఘూర్ణిల్లుచుండిరి.

బేకనుయెవ్వరు ? అరవిందమూలమున, మనకుసర్వము తేలగలదు. అరవిందతనయానందమును బట్టజాలకుండెను. ఆపె అమ్మవారుగారినిగాంచి "కరములమోడ్చి, భూమిపై మోకారి" తండ్రి! తమరుశ్యామలరావుగాని మరెవ్వరును కారు. ఆర్యావర్తమున మీనామసంకీర్తనలువినుటెక్క మరి చూడనోచనైతి, నేటికాకోరతదీర్చితిరి. భారతమాతగర్భ

మున పుత్రివై జన్మించినందులకు పొందవలసినభాగ్యమును పొందు చుంటివి అన్నా! నాప్రాణముల రక్షించితివి. నీవే నాభ్రాతవు. నీకునా వందనశతము అనిబల్కెను. అమ్మవారుగాను మందహాసముతో అరవిందునిలేవనెత్తి సోదరీ! యింకను కష్టములగడచి బయటబడితిమని సంతసింపరాదు. నేచేయవలసినదింకను మరింతగలదు.

అర—అన్నా! నాకేమిశెలవు.

అ—నీవిందేయుండవలయు. ఇందలి కాంతలు నీకుసపర్యలుజేయు చుందురు. నీవు వారిని విశ్వసింపదగుచు నీవు నేనుస్వయముగావచ్చిచెప్పిన గాని ఈమేడదిగవలదు. ఆమగువ లెట్లుచెప్పిన అట్లేజేయుము. అని చెప్పి మేడమెట్లు దిగి రాజబాటబట్టి యెక్కడకో బోవుచుండెను.

పండ్రెండవ ప్రకరణము.

విలాసభవనము కామినీ కుసుమములతో నలంకరింపబడి యెంతయు నేత్రపర్వము గావించుచుండెను. ఒక్కనాటి సాయంసమయమున విలాసభవనముప్రక్కనేయున్న రాజబాటపై మోటారొకటి బోవుచుండెను. అందొక్కయువకుడు సుప్రసిద్ధదుకూలములగట్టి శిబిమీరకూర్చుండియుండెను. ఆతడు ఇటునటుచూచుచుండ సౌధోపరిభాగమునలంకరించిన వారిజనేత్రలు వానికంట బడిరి. ఆతడట్లెగాంచుచు, డ్రైవరుతో మెల్లనబోనిమ్ము అనిపలికెను. మోటారుమందగమనము నభినయించుచుండె.

మనరసికుడు వారిజనేత్రలను రెప్పవాల్పక చూచుచుండ, అతతనిని యెరకంటగాంచుచు, సిగ్గునభినయించుచు, నర్మగర్భసంభాషణములతో యువకునిచిత్తస్థైర్యముచు పటాపంచలుజేయుచుండిరి. మన యువకుడు వారలవంకగాంచుచున్న కొలందిని యాతని ముఖవర్చస్సునకు

మారిపోవుచుండెను. క్రమక్రమముగ నాతనిమోము కసిగందుచుండెను. ఆతఁడు రెప్పవాల్పక అల్లేమాటున శిరఃకంపముతో పెదవిగఱచి డ్రైవరునితో 'పోనిమ్ము' అనిబలికెను. మోటారు పవనవేగమున బోవుచుండెను. చదువరులారా! ఈతఁడెవ్వరు? మానుషమూర్తి, చోరనాయకుఁడు యీతఁడేసుమీ! ఆతఁడు తిన్నగ నతని వాసముజేరెను. ఆతఁడు విలాసభవనమున కాంచిన వెలయాండ్రలో నొక్కతె మదలంచినకొలందిని యాతనిమోము రక్తవర్ణమును దాల్చుచు శరీరము వణఁకుచుండెను. ఆతనిమానసము వివిధరీతుల వరువెత్తుచుండెను. అతఁడు ఔరా! నన్ను వంచించుటకు శ్యామలరావు పన్నిన పన్నుగడ కావలయు. ఆవేశ్య సరిగా అరవిందను పోలియున్నదే! వెలయాలిమైయుండునా? నిక్కమముగా అరవిందయేనా! అరవింద శ్యామలరావున కెట్లు దక్కెను? ఔరా! శ్యామలరాయా! ఆవేశ్య నిక్కమముగ అరవిందయని నేనువిశ్వసించి యాభవనము చొత్తుననియు వెఱ్ఱిశ్యామలరావు పన్నినపన్నుగడ కాని వేఱు కాదు. కానిమ్ము ఎత్తుకుపైయెత్తుగదా! వేయవలయు. నేనుసామాన్యుఁడనియే యోచించుచుంటివా! ఈవిలాసవతుల మేడలపై నుండి క్రిందకు దింపవలయు. కానిమ్ము. అనిఆతఁడిట్లు యోచించి పెద్దయెలుంగున, తనవారినెల్ల బిలిచెను. బిలబిలలాడుచు వారెల్ల, నాతనిమ్రోల నిలువబడిరి. తోడనే యాతఁడు "రంగా! నీవుగోదావరిగాడు-భేతాళుడు-మరిముగ్గురు దొంగలవలెనే విలాసభవనముదూరవలయు. మిగిలినవారు రక్షకభటులై మిమ్ములను వెన్నుదన్నుచుండినటుల, నటించుచు లోనప్రవేశింపవలయు. నేను రక్షకభటాధికారినై దొంగలబారినుండిస్త్రీసమూహమును దప్పించుచుండినటుల, త్రోవద్వారా విలాసభవనమెక్కి, కాంతలను క్రిందకు దింపి మోటారులో నెక్కించెదను. బహుమెలకువతో వర్తింపవలయు వేగిరపడుడు" అనిపలికి తనమందిరములోనికి బోవుచుండెను. కాంతలు లెల్లతమతమ పనులపై లోనికిబోయిరి. రాత్రిసుమారు రెండుయామములు

గును. నేనే యీ ...ర్వ ర్తించుటకై హంతకులెల్ల బయల్వె.. వెలికి నో
రక్షకభటాధికారినై మున్ముందు బోయెదను. హర్తలెల్ల వివిధ మార్గ
ముల పట్టణప్రవేశము గావించుచుండిరి.

రక్షకభటునిరూపమున పట్టణములోని కరుగుచున్న నొకహర్త
ను వెరుకనుండొక రక్షకబటుడు కరతాళముతో బిలచెను. ఆతడక్కడా
గి వచ్చేయుమిత్రుని కలుసుకొనెను. వారిరువురు కొంతతడవు ప్రసంగించి
శ్యామలరావు ఇంటివైపు బోవుచుండిరి. వారట్లరుగుచుండగనే మరొక
రక్షకభటుడు మోటారుపై వారలకలిసెను. వీరిరువురును మోటారు నెక్కి
రి. మోటారులోవిచ్చేసిన రక్షకభటు డదృశ్యుడయ్యెను. వారిరువురు
మోటారులో బోవుచుండిరి. మొదటిరక్షకభటుడు మోటారును నడుపు
చుండెను. మోటారుశ్యామలరావు గృహముజేరి నిలచెను. మోటారులో
కూర్చునియున్న రక్షకబటుడుశ్యామలరావుగృహముజే రితలుపుకొట్టెను.
లోనుండెవ్వరో వారిని యడుగ, రక్షకభటుడు 'రఘురాముడని" బదులు
పల్కెను. శ్యామలరావుఅర్థాంగి తలుపు తెరచెను. రక్షకభటు...పెను
జూచి "మీరుపిల్లలును ఇక్కడనుండి దాటవలయు. మానవహంతకుడు
మనయింటకన్నము వేయ బయల్వెడలు చున్నాడు ఇదిమా అయ్యగారి
యాజ్ఞ. వేగిరపడవలయు. మోటారు వేచియున్నది. మోసము' అనిబ
...ను. ఆమె యేమియోచించెనో మనమెరుంగము గాని యామె తక్ష
ణమే తనబిడ్డలతో, గుమ్మముముంగట వేచియున్న మోటారు నెక్కెను.
ఆమెప్రక్కనే రక్షకభటుడు గూర్చుండెను. మోటారు రాముని నెలవుపై
పువురుగిడిబోవుచుండెను. అతని నెలవెక్కడి?

బెజవాడకు ఈశాన్యమున ఒకమైలుదూరమున చిన్నఅడవి కలదు.
అందు వన్యమృగంబులేమియు లేవుగాని తరులతాగుల్మా...లుమాత్రము
విస్తరించియుండెను. ఆచిట్టడవినడుమ నొకపర్వత... . దానిపైనొక
ఇంటిముకలదు. మనమోటారు ఆకుటీరముదం... ...బడెను. ...)వ

రుక్రిందకుదిగి కుటీరముతలుపు తెరచెను. లోపలంతయు అఘాతము. అఘాతములోనికి మెట్లుగలవు. సోపానములు దిగినవెంటనే పెద్దమందిరము కలదు. ఆమందిరమునంటి గదులు చాలకలవు. అంతయు గాఢాంధకారమే. డ్రైవరుచేతనున్న విద్యుచ్ఛక్తిదీపమును ముట్టించి, ఒకగదితలుపు తెరచెను. రెండవవాడు శ్యామలరావు అర్ధాంగినిపిల్లలను లోనికిగెంటివేసెను. డ్రైవరు బీగము వేయుచుండెను. ఆసమయమున రెండవరక్షకభటుడు నాలుగడుగులు వెనుకకుపైచి మొలనుండెద్దియో దీసి "ఢాం" అని పేల్చెను డ్రైవరుభూమిపై బడిపోయెను. రక్షకభటుడు గదితలుపుదీసి 'మీరిందేయుండుడు' అనిశ్యామలరావు యర్ధాంగినిచూచిపలికి, తలుపులుబిగించి బీగముపైచి బయటవేచియున్న మోటారునెక్కి పురప్రవేశ మగుచుండెను. మోటారుతిన్నగ విలాసభవనమున జేరుచుండగనే మనరక్షకభటుడు రక్షకభటాధికారి యయ్యెను. విలాసభవనమునుండి యొకత్రాడుమాత్రము వ్రేలాడుచుండెను.

రక్షకభటాధికారి సౌధాంతర్భాగమున దిరుగుచుండెను. మోటారుపై విచ్చేసిన రక్షకభటాధికారి (కత్తేదారు) వ్రేలాడుచున్న త్రాడుమూలమున సౌధముపై కెక్కుచుండెను. ఆతడు చోరనాయకుని యనుచరులు లోనికిబోవుచుండుటను తిలకించెను. అతడు బిరబిర లోనప్రవేశించెను. అంతయు నిశ్శబ్దమే! హంతకచక్రవర్తి కాదు. పక్కతరక్షకభటాధికారి పై భాగమున హడావిడిగా తిరుగుచు మొదటిమందిరములోనున్న అరవిందను తక్కుంగల విలాసవతులను చూచెను. వారు గవాక్షమునుండి చూచుచుండిరి. అతడాత్రుతతో తలుపుగెంటెను కాని ఘుడియవేసి యుండెను. ఆతడు కిటికీనుండి అరవిందను స్పష్టముగ గాంచెను. ఆత డాయాసముతో 'అరవిందా! దోషాచరసదృశుడు విలాసభవనము ప్రవేశించుచున్నాడు ఆతని యనుచరులు క్రిందిభాగమున కొల్లగొట్టుచున్నారు. విమానసాహ్రణములు దక్కవు. వేగిరపతపలయు

ఆత్రోవమూలమున చెచ్చెరక్రిందకుదిగి మోటారు నెక్కవలయు. త్వర పడుడు. మా సంరక్షణ జేయవచ్చితినని బలికెను. అరవింద విన్న మాటను సూచించుచు ఆ-అ-అం-య్యా-ఆ-ప్రక్క-గదిలోనికి రండు. అనిపలికెను. నేనే తత్తరపాటు నాగదితలుపులను గెంటి తటాలున లోన ప్రవేశించెను. ఆ మందిర మంతయు మన్నుతో పూతపూయబడి యుండెను. ఏకవిధమున కాలచక్రమెట్లు తిరుగునో యెవ్వరు చెప్పగలరు. వక్రగామిగా ఆతడు చివాలున లోనప్రవేశించగనే అడుగభాగము భిల్లున కూలిపోయెను. గందరగండడు గది యడుగుభాగమున త్రవ్వబడి యుండిన అఘాతకూపమున గుభాలునకూలిపోయెను. ఆతడు మొదలు నరికిన చెట్టువోలె పడిపోయి క్రోధశోకముల మిన్నుముట్టుచుండెను. ఆతడు బోనులోజిక్కిన ఘోరశార్దూలము వోలె ఘూర్ణిలుచుండెను. కాలుజారిన కలసిరాదనుట ఇట్టిదేగాబోలు ! ఇదియే కాలప్రభావము ! నేనే యనుచరులు తస్కరులెల్ల సోపానముల నెక్కి మొదటి యంతస్తుజేరగనే తలుపులు గుభాలున మూసుకొనిపోయెను. రక్షకభటుల వేషము బూనినహంతకులు మేడక్రింద భాగమునున్న చావిడి జేరిరి. వీథి ద్వారములు వెనుకరీతిని దృటిలో బంధింపబడెను. తస్కరులు మొదటి యంతస్తుజేరగనే మనరక్షకభటాధికారి గోడప్రక్కనుండి గాంచి హంతకులెల్ల వెనుకబాటునుండి బర్రుమని యీలగొట్టెను. హంతకులు దగ్గరిల్లినతోడనే కట్టుకుటీమందిరములలో డాగియున్న సహాజరక్షకభటులు గోదావరిగాడిని- భేతాళుని- రంగని వారియనుచరులను జుట్టుముట్టిరి. శ్యామలరావు చేత పిస్తోలునుధరించి రూక్షవీక్షణములతో 'అడుగు కదిపితిరేని బుర్రలూడిపోవును' అని గాలిలో గుండును 'ఢాం' అని పేల్చెను. పాపము హంతకులు శ్యామలరావును గాంచనేరక వణకి పోవుచుండిరి. రక్షకభటులు వారిచేతులకు, కరదండముల తగిల్చి, ప్రక్కగదిలోనికి పడగెంటి బీగములవైచిరి. శ్యామలరావు, బిరబిర మేడ

మెట్లపైనుండి క్రిందిచావిడిలోనికి వచ్చెను. రక్షకభటులవేషము బూనిన మన కోటిశ్రావణి యనుచరులు శ్యామలరాయుని సిబ్బందిజట్టు ముట్టియుండెను. ప్రత్యక్షయమునివలె తమకట్టెదుట సాక్షాత్కరించిన శ్యామలరాయుని హంతకులు గాంచ నేరకుండిరి ఆతడు తనరక్షకభటుల నెల్ల చూచి 'చూచెదరేమి, సంకెళ్ళుగిలించి, క్రిందికొట్లలో బంధింపుడు' అనివారలవంక క్రోధారుణితనేత్రములతో జూచి అంబరవీధికి 'ఢాం' అని పిస్తోలును పేల్చెను. తృటిలో వారెల్ల బంధింపబడి కొట్లలోనికి తోయబడిరి. రక్షకభటులు శ్యామలరాయుని యెదుట నిలువబడియుండిరి. ఆతడు వారల గాంచి 'విలాసభవనముజుట్టును కావలియుండుడు' అనిపలికి లోనికిబోవుచుండెను 'ఢాం' ఢాం శబ్దములతో పురజనులెల్ల మేల్కాంచి విలాసభవనము జేరుచుండిరిగాని రక్షకభటులు వారిని లోనికి బోనిచ్చుటలేదు. శ్యామలరావు- కాదు- బేకను- కాదు- అమ్మవారుగాడు- కాదు దొంగలలో గజదొంగ రక్షకభటాధికారి ఇన్ని మార్పులుజెందె. శ్యామలరావు మేడపై భాగముజేరి 'నారాయణరావుగారూ! అని యొకసత్తేదారుని బిలచెను. తోడనే అందొకనుండి యొక సత్తేదారు, నారాయణరావు గుభాలున ఊడిపడి యాతనిమ్రోల నిలువబడెను. శ్యామలరావాతనిగాంచి మేడముంగటనున్న మోటారుపై మీరు తక్షణమే బందరుపోయి తెల్లవారకుండగ సూపరిండెంటుగారి నిచ్చటకు తీసుకొని రావలయు వెళ్ళుము అనిపలికెను. ఆతడు చిత్తమని బలికి వెడలిపోయెను.

శ్యామలరావు అరవింద మందిరము జేరి 'అమ్మా అరవిందా!' అని బిలచెను. ఆమె శ్యామలరాయుని కంఠమును గుర్తించి తలుపుతెరచి సాష్టాంగ దండప్రణామమాచరించెను. శ్యామలరావు 'తల్లీ! దీర్ఘసుమంగళీభవ లెమ్మా నీకష్టములుతీరినవి' అనిబలికెను. ఆమెయాతని పాదములనుండి లేచి నిలువబడి యానందబాష్పముల విడచుచుండెను. శ్యామల

రావు అమ్మా! నరాంతకుడు కూపమున గూలినాడు. హంతకులు బంధింపబడిరి. పరివంధి సెలవుతీసు కొంటివి. దొంగరాముని యనుచరులు జిక్కిరి. నీవు సంరక్షింపబడితివి. ఇక పరులసొత్తు పరులకంద జేయవలెను. అని బల్కెను.

అర—తండ్రీ! నీపేరు ఆర్యావర్తమున చిరస్థాయిగా వెలయును గాదె! హంతకులెల్ల బంధింపబడినకొట్టు నాకుచూపెదవా! అయ్యో మీకడుపున బుట్టినను మీ ఋణము దీర్చుకొనజాల. అన్నింటికిని నామ పూర్వక వందనశతమే- నాకుతలిదండ్రులు లేని లోటు లేదు.

శ్యా—తల్లీ! దానికేమిగాని ఇటురమ్మా నీకు సర్వము చూపెద. వారిరువురు బలేరాముడుకూలిన కూపము చేరిరి. శ్యామలరావు అమ్మా ఇటురమ్ము. లోకభయంకరుడను నేనే హంతకచక్రవర్తిని నేనే మాయామయుడను నేనే దొంగరామునియన్నను నేనేయని విరగబడి నవ్వుచు డిడిగో-రమ్ము అనిబలికెను. అరవింద శ్యామలరావును జూచి 'తండ్రీ! వలదు. నేనాతనిచూడజాల' అనిబల్కెను. శ్యామలరాముని మొఱుగు వినిపింపగనే "శ్యామలరాయా! మా కటువంటివాడను నీవో. బెట్టికొందువా!

బలేరాముని జయించిన వాడింతవరకును లేడు- మరియొక జన్మకైనను నీకుశతృవుగనే బుట్టి నీరక్తపానము చేసితీరెద-మా పేరు మాపెదవా? మాలోమన్చుకొక్కనినైన విడవవుగా! ఆ అరవిందా! అరవిందా! శ్యామలరాయా! అని వాపోవుచుండెను.

శ్యా—తుచ్ఛుడా! నోరుమూయుము. దుండగము లెంతకాలము సాగునురా! అరవిందా! రమ్ము. మిగిలినవారిని జూపెదను. శ్యామలరావు అరవిందకు తక్కుంగలచోరుల బంధింపబడినమందిరములు జూపుచు వారిదుండగములను జెప్పుచుండెను. పౌరులు గుంపులుగుంపులుగా, గూడి విలాసభవనము జేరుచుండిరి. తూర్పు తెల్లవారవచ్చెను.

ఆసమయమునసూపరింటెండెంటు పత్తేదారునితో బందరునుండి మోటారుపై విచ్చేసెను. శ్యామలరా వాతనిని గాంచి నమస్కరించి మేడమీదకుగొంపోవుచు జరిగినసంగతులెల్ల నివేదించుచుండెను. సూపరింటెండెంటు శ్యామలరాయుని గాంచి, ఆనందమున తన్నుదాను మరచుచుండెను వారెల్ల బలేరాముడను నేనేయని ఘూర్ణిల్లుచున్నకూపము జేరిరి. సూపరింటెండెంటు వాని వికృతాకారమునుజూచి వెరగొందుచుండె. ఎల్లరు విభ్రాంతులై జూచుచుండిరి.ఆసమయమున బలేరాముడు 'ఔరా! శ్యామలరాయా! శ్యామలరాయా! నీనెత్తురు త్రాగెద—ఓరీ! నేనే గౌరీపతిరావు తులు బయును అంతమొందించిననాడు నీవు జీవించితే...! నిన్ను పిస్తోలుచేగాల్చి మోటారులో వేసుకొని రహస్య...మందిరమున బంధించిననాడు నీవుబ్రతికిలేవో! న్యాయస్థానమున ... సాక్ష్యము చూపిననాడు నీవు బ్రాణములతో లేవో! రామశెట్టియింటకన్నము జేసిననాడు నీవుగానరావో!

అడవిందిను చెరబట్టినపుడు నీవీ పుడమిపై లేవో! నిన్ను వ్యర్థముగ వంచించి సువర్ణాభరణములహరించిననా డేమైతివో! నీసమక్షమున నిలిపిన కామినీకై తపవిగ్రహమున నీచాకచక్యమేమయ్యెనో ఓరీ! చావక బ్రతికియుంటివా! చావక బ్రతికియుంటివా! పరాభవమొందుటకన్న ప్రాణమువీడుటమేలుగదా! చావుయెన్నటికైనను తప్పనిదే! నాచే నీశరీరమంతయు రక్తసిక్తముగా లేదా! పదుగురిలో నీవు ఛీఛీ! అనుపించుకొనలేదా! బలేరాముడను నేనే నాచేతులనుండి నీచావు ఎన్నిసారులు తప్పెనురా! నామేధాశక్తి గాంచితివా! ప్రాణమునాకొక్కడను గొనుచుంటివా! నన్నుబట్టితినని బీరములు పలుకుచుంటివా! నేనే నీచే చిక్కనది—నిన్ను మారుజన్మంబునకైనను సాధించెద—నీకుశాత్రవుడ (నే జన్మించవలె-నిన్ను కసిదీరజంపవలె-నీరక్తము త్రాగవలె-నీప్రేగు ...ధరించవలె-నమెదడు మెసవవలె-నాకుమనశ్శాంతి చేకూరవలె-శ్యా

మలరాయా! అరవిందను జేర్చుకొనుగా! 'శ్యామలరాయా! శ్యామ లరాయా' అనిబలికి చిన్నాలునతన మొలనుండి కైజారును పెరగి కంఠమున బొడుచుకొనెను. సూపరింటెండెంటు విస్మయముగాంచుచుండెను. బలేరాముని శరీరమంతయు రక్తసిక్తమగుచుండెను. అతడు కరచరణములను గొట్టుకొనుచు- గోండ్రింపుచుండెను.

కొంతవడి బలేరాముడు ఏమియో వాపోయి తనతమ్ముని దొంగరామునిపరలోకమున కలుసుకొనెను. ఆతనిహస్తమున మాత్రము ఖడ్గమట్లేయుండెను. తోడనే శ్యామలరావు సూపరింటెండెంటును గాంచి అయ్యా! దుర్భిక్షుడు కూలినాడు మిగిలిన వారు బంధింప బడియేయున్నారు. మన మిప్పటికి బలేరాముని రహస్యమందిరము జేరవలయునని బలికెను. సూపరింటెండెంటు అంగీకరింప వారెల్ల బలేరాముని నెలవు జేరుచుండిరి శ్యామలరావు సూపరింటెండెంటుకు బలేరాముడుహరించిన ద్రవ్యములు తనభార్య బిడ్డలను జూపెను. శ్యామలరావు బలేరాముని నెలవుకనుగొనుటకై తనదారావు ద్రాగులను కూడ దొంగల రహస్యమందిరమున బెట్టినందులకు వెక్కసబడెను. సూపరింటెండెంటు శ్యామలరావుభార్యాబిడ్డలను తనమోటారుపై ఇంటికిబంపివేసెను. ఆతడు శ్యామలరాయుని బుద్ధిసూక్ష్మతకు మెచ్చుకొనెను.

సూపరింటెండెంటు మధ్యాహ్నము సభజేసి రామనాథుని విడుదలజేయించెను. గోపతిరావు ద్రవ్యమంతయు అరవింద కిప్పించెను. అరవిందభర్తకు ఇంగ్లాండుకు తంతినంపించెను. శ్యామలరావు సూపరింటెండెంటువదవి కర్హుడని దొరతనము వారికి తెలియబరచెను.

శ్యామలరావు అరవిందను బిలిచి సూపరింటెండెంటునకు చూపి వినయమున ఆపెభర్త నిచ్చేయువరకు తనయింటనే యుండగోరెను. రక్షకభటులు తస్కరులనెల్ల కరదండములతో పురమునందు త్రిప్పి కారాగారమున బంధించిరి.

తనువరి శ్యామలరావు సూపరింటెండెంటు వద్దసెలవుదీసుకొని రాజమహేంద్రవరముజేరి దొంగరాముడు హరించిన ద్రవ్యమెవరిది వారి కప్పించివేసెను. దొంగరాముని మూలమున బంధింపబడిన నిరపరాధుల విడుదలజేయించి బెజవాడచేరెను. ఆతను బెజవాడ చేరిననాడే, తనకు డిప్యూటీసూపరింటెండెంటు పదవి యిచ్చినటుల, దొరతనమువారినుండి తంతివచ్చెను.

పౌరులును, రాజకీయోద్యోగులు, శ్యామలరావు నందుతమకు గల భక్తివిశ్వాసములు బ్రకటబరుపనటుల పెద్ద యుత్సాహముచేయ సాగిరి.

చదువరులారా! శ్యామలరాయుని శక్తిసామర్థ్యముల మీరొక్కసారి తిలకింపుడు. పౌరులననుమ, పుష్పమాలాలంకృతుండై మందహాసమున శ్యామలరావు మీకులోచన గోచరమగుట లేదా! శ్యామలరాయుని చారిత్ర సంస్మరణీయముగాదా! అట్టివాడు మీసోదరుడని చెప్పుకొనుట మీభాగ్యముకాదా! రాజకీయోద్యోగులెల్ల నిట్టివారేయైన మనకేమి కొరతయుండును.

ఓం—శాంతి శ్శాంతి శ్శాంతిః

సంపూర్ణము.

# చండిక.

గ్రంథకర్త:—ముత్తనేని వేంకట చెన్న కేశవులుగారు.

చండిక స్వాతంత్ర్యమంటప ప్రదీపిక, చండిక సౌందర్యవార్ధి సమృద్ధి చంద్రిక, చండిక సమదారాలిదుప్రిమకుతారిక. చండికాచరిత్ర మతివిచిత్రము; సూక్ష్మదృష్టిం బరికించువారికిఁ జండిక భామినీరూప బ్రహ్మరాక్షసి; కామినీరూప మృత్యుదేవత. స్థూలదృష్టిం బరికించు వారికిఁ జండిక వీరపత్నీశిరోరత్నము; పరమసాధ్వీతిలకము. చండిక కౌక్షేయముతోఁగానిపనిఁ గటాక్షముతో నెరవేర్చినది. కత్తిబట్టుకొని కదనరంగమున కుఱికినది. రక్తముగార్చి రాజ్యము సంపాదించినది. చండికకు స్వాతంత్ర్యమే స్వర్గలోకము; పారతంత్ర్యమే ఘోరనరకము. భర్తృస్వాతంత్ర్యమునకుఁ జండిక పడినపాట్లు చెప్పిన దీఱవు. పతిని ప్రభువుం జేయుటకుఁ జండిక పన్నిన తంత్రములు వర్ణనాతీతములు! పతిహితవర్తనమే చండికకుఁ బరమధర్మము. భర్తకొఱకుఁ జండిక పాప భీతి విడిచినది. ఘోరహత్యలు గావించినది. పాంసుల యను దుష్కీర్తి నందినది. తుదకు భర్తకు రాజ్యమార్జించినది. కాని కట్టకడకు చండికకు బైటకొంగే పామై కఱచినది. భర్తయే పగఁదలంచి చండికను బగతుర కప్పగించినాడు. అభిజాత్యసంపన్న యగు చండిక ఆత్మహత్య గావించు కొనినది. ఇంతటి సాహసిక—ఇంతటి వీరకాంత—ఇంతటి నెఱజాణ చరిత్రము మీరిదివఱకుఁ గని విని యుండరు. వెల రు 1 మాత్రమే.

శైలికి గొన్ని పద్యములు:

శా. పాణింగ్రూరకృపాణిఁ బూని బలవత్ప్రత్యర్థిభూభృద్భట
    శ్రేణిం దాఁకి, యసృక్పరంపరల నుర్వింగార్చినంగాక, యీ
    క్షోణీరాజ్యము శూరభోజ్య మెటువచ్చుఁ ముండ లట్లిండ్లలోఁ
    బ్రాణాశంబడి వేడియశ్రువులఁ గార్పఁ క్షత్రియగ్రామణీ!
గీ. కత్తిఁబట్టకున్న, నెత్తురోడ్పకయున్న, ఘోరబాధ లొంద నేరకున్నఁ
    బ్రాణిహింససేయఁబాల్పడకున్నను లభ్యమౌనె రాజ్యలక్ష్మియొఱక?

---

నా రిట్లు వ్రాయవలెను:-కురుకూరి సుబ్బారావు, ప్రొప్రయిటరు.
సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.